# గృహవైద్య చికిత్సాసారము



రెండవ భాగము.

గ్రంథకర్త


మహేశ్వర్ల మల్లయ్యగారి కుమారుడు

సూర్యనారాయణ


పబ్లిషరు

గొల్లపూడి వీరాస్వామి

శ్రీసీతారామా బుక్కుడిపో,

రాజమండ్రి.

——:O:——




మొదటి కూర్పు

*

* *


శ్రీసీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

రాజమహేంద్రవరము.


  [వెల రు 1—0—0

1927

# విషయసూచిక.

సంపూర్ణము.



1½

1980



శుభమస్తు.

శ్రీధన్వంతరయేనమః

# గృహవైద్యచికిత్సాసారము.

## రెండవభాగము

### 1 త్రివంగము.

నాగము, వంగము, సీసము, ఈ మూడు సమభాగములుగా చూర్ణముచేసి దాకలోవేస్తేది. మజ్జిపూడల రసముతోను, ఆవపూడల కట్టుతోను, కలిపితే నల్లగా చూర్ణమగును. ఆచూర్ణమును కల్వము మీద ఆరసముతోనే మర్దించి అయిదు పుటములు వేయవలెను.

ఉబ్బసానకు వెన్న, నెయ్యి, పంచదారవీటి అనుపానములతో యియ్యవలెను. మరెన్ని మేహాలకున్ను, కాళ్ళుపగిలినవారికిన్ని, గండ మాల లకు శగలకు ఇయ్యవచ్చును. గురిగింజప్రమాణము రెండు పూటలు యిచ్చేది. ఇచ్ఛాపథ్యము.

### 2 ఛాందన కర్పూరము.

ఇంగిలీకము 3 తులాలు రసకర్పూరము ½ సవ్వీరం 3 పావు తులాలు, ఉప్పు వక శేరుక్రింద ఒక శేరు మీద పోయవలయును. ఒక కుండలో యెనిమిది జాములు ఒకే జాతి కఱ్ఱలతో అనగా వేపకఱ్ఱల తో నండవలయును.

## 3 జోగిరస మాత్రలు

నాభి, గంధకం, తాళకము వెలిగారము సైంధవలవణము గౌరీపాషాణము ఉత్తరేణిబియ్యము త్రిఫలములు త్రికటుకములు వీటి నిసమభాగాలుకూర్చి వీటియెత్తున శుద్ధచేసిన నేపాళాలు వేసి గుంటకన్నాకురసాన నాలుగు జాములు మర్దించేది. నిమ్మపండ్లరసాన నాలుగుజాములు మర్దించేది అనంతరము మినుపగింజపరిమాణము మాత్రలుచేసి కరాటాన జాగ్రత్తపరచి యుంచుకొనేది.

## —♦ అనుపానములు వగైరా ♦—

స్త్రీలకు పిశాచములు పట్టినవారికి నాభి స్థానమందు పొగవేసేది. గర్భము నిలిచేటందుకు పుత్రజీవి కాయలవిత్తుల చూర్ణము తో ఇచ్చేది. బహుమూత్రాలకు సుగంధిపాలవేరు గంధముతో ఇచ్చేది. శీతజ్వరాలకు అల్లపురసముతోను ద్వంద్వ రోగాలకు ధనియాల చూర్ణముతో నయినను వస చూర్ణముతో నయినను ఇచ్చేది అధిక జ్వరాలకు చక్కెరతో యిచ్చేది. అధిక దాహానికి జీలకఱ్ఱచూర్ణముతోడను దగ్గులకు త్రిఫలాలచూర్ణముతోడను యిచ్చేది అరికాళ్ళు అరచేతులు రొమ్ము మంటలకు పచ్చి భంగుఆకు (గంజాయి ఆకు) రసముతో ఇచ్చేది. మేహాలకు వావిలాకు రసముతో ఇచ్చేది. పైత్యాలకు నిమ్మపండ్లరసము అనుపానముతోడను పైత్యజ్వరాలకు నిమ్మపండ్లరసముతోడను వాత జ్వరాలకు నెల్లికాయల రసముతోడను గ్రహణికి ఆవునెయ్యితోడను వాంతులకు ఆముదముతోడను యిచ్చేది. ఉశిరికకాయ పప్పుతో ఇచ్చిన జ్వరాలు మానును పాముకరచినవారికి రెండుమాత్రలు పొడిచేసి కరచిన చోటరాచి అక్కడ నుంచేది లోపలికి తుమ్మాకు రసముతోటి యియ్యవలెను. వెలు

పరమునకు అల్లపు రసముతో నిచ్చిన తగ్గును. అదురు వాయువులకు ఆవునేతితో నుపానము ఉబ్బసాలకు త్రిఫలకషాయముతో ఇచ్చేది. ఉష్ణజ్వరాలకు మంచినీటితో ఇచ్చేది. వీర్యవృద్ధికి తాంబూలముతో సేవించనిచ్చేది. తేనె అనుపానముతో నిచ్చిన శరీరమునకు మంచిబలముచేయును. గొంతు మందమునకు త్రికటుకములు పొడిచేసి రెండు మాత్రలు ఆ పొడితో గూడనూరి కలిసి యిచ్చేది. కర్ణమూలానికి తేనెతో యిచ్చేది. అజీర్ణములకు పెరుగులో యిచ్చేది. కాకరాకు పసరుతోనిచ్చిన వాతశూలలుమానును. చత్వారము గలవారికి వుగింజనూంత తీసికొని మంచినీళ్ళతో అరగ దీసి కంటికి వేసేది. మూల వ్యాధిగలవారికి జాజికాయను చూర్ణముచేసి ఆచూర్ణముతో లోపలికి యిచ్చేది. దొండాకు రసముతోనిచ్చిన వీర్యవృద్ధికలుగును. పండ్లనొప్పులు గలవారు ఈమాత్ర పొడిచేసి రుద్దవలెను. మేహ పైత్యాలకు గుంటకన్నాకురసముతో యియ్యవలేను. గుంటకన్నాకు రసముతోడనే శరీరము నొప్పులుకలవారికి యియ్యవచ్చును. కండ్ల మెరుపులుఅజీర్ణమునకు దురదవాయువులకుఆవునేతితో యియ్యవలెను అతి సారములకు తుంగగడ్డల రసముతో యియ్యవలెను. గచ్చాకురసముతో శూలలకున్ను తేనెతో దీపనమునకున్ను నీరుకట్టునకు పుల్ల రసతోనుదానిమ్మన్ను పిత్తానకు జీలకఱ్ఱకషాయము తోడను పురాణ జ్వరాలకు ధనియాల కషాయముతోడను శొంఠి కషాయము తోడను యిచ్చేది. తేలు కుట్టినవారికి కుట్టినచోట పొడిచేసి వెట్టేది. ద్వంద్వ జ్వరాలకు మజ్జిగతో యిచ్చేది. అల్లపురసముతో దంతవాయువులకు వావిలాకు రసముతో క్షయలకును మేకపాలతో రేచీకటికిని ఘృత బెల్లముతోడను రొమ్ములో మంటకు నెల్లికాయల రసముతోడను

పురుగుకాటునకు ఆవునేతితోడను. జన్నికి వావమము తోటిన్ని పాం డువులకు నిమ్మపంటిరసముతోటిన్ని కన్నులు మంటలకు మంగాకు రసముతోడను. (కంటికి వేసేది.) గుల్మానికి నీటితోయిచ్చేది. మల ము కట్టేటందుకు జాజికాయతోడను అసలు తాగ్రిమ పాము కరచిన వారికి గాని మరేపామైనకరచినవారికి గాని నెయ్యి ప్పెప్పతోటిన్ని పిండి దొండాకు రసము తోటిన్ని యిచ్చేది. విషవని జ్వరాలకు రెం డుదినముల కొకసారి వాముతోటి యియ్యవలెను. విషునని జ్వరము విడుచును. ఆరాత్రి శొంఠి కాషాయము తోను యియ్యవలెను. గుల్మాలకు ఇంగువ త్రిఫలకషాయము తోడను శోఫలను అల్లపు రస ము ఉశిరికపప్పు అనుపానము తోడను యిచ్చేది. పాండువులకు మే హాదులకును కామిణి రోగములకుపాత చిట్టము కషాయముతో యి చ్చేది. దుష్టరోగములకు గచ్చపప్పున్ను తగిరెశ విత్తులున్ను చూర్ణం చేసి ఆచూర్ణము అనుపానముగా బెట్టియిచ్చేది. ద్వంద్వరోగములకు చందచక్క కషాయముతో ఇయ్యవలెను. కడుపు కుట్టునకు శొంఠి కషాయముతో యియ్య వలెను. లేదా వాము రముతోగానియియ్య వచ్చును. గజ్జిగలవారు నేతితో రంగరించి లేపనముచేసేది. రక్తకా సానికి అల్లంరసమును తేనె యున్ను కలిపి యిచ్చిన మానును. ఈప్రి కారముగా రోగమును తెలిసికొని ఆయా రోగములు గలవారికి అను పానవిశేషములతో నియ్య వలెను. ఇచ్ఛాపత్యము.



అగ్నిముఖచూర్ణము

ఇది అజీర్ణి, పురాణజ్వరాలు, ఉదావర్తము, గ్రహిణి, ప్లీహోదరము, ఎక్కిళ్లు, కడుపుబ్బు, శ్వాసకాసము, మగన్ని రొమ్ము పొత్తికడుపు, బొడ్డు, కోష్టము, (పేగు) మొదలయిన వాటియందు వాతపిత్తామలకలయిక వలనపుట్టినట్టిరోగాలుఅగ్నిమాంద్యము మున్నగు వానిమీద చక్కగా నడుచును. తినినసమస్తపదార్థములను, నానావిధములగు అన్నములను (అనగా రూక్షనుకలుగ చేయునట్టివి మొదలగునవి) భుజించిన వెంటనే భస్మపటల మగునటులచేయుటలో పెట్టినది పేరు.

చేసేక్రియము.

చిత్రమూలము, అతివస, చంగల్వకోష్టు, ఇంగువ, సౌవర్చ లవణము, వస, పిప్పళ్ళు, పుష్కరమూలము, మెట్టతామరదుంప, గంటిభారంగి, శొంఠి, యవక్షారము, వాయువిడంగాలు, మిర్యాలు, మోది, గజపిప్పళ్ళు ఈదినుసున్నలను భాగాలుతీసి దంచి చూర్ణించి, ఆ చూర్ణమునకు సమముగా కరక్కాయల చూర్ణమునుచేర్చి ప్రాతఃకాలములందు చన్నీటితోగాని వేడినీటితోగాని, శొంఠిరసానగాని, ఆవు నేతితోగాని రెండుమాడలమెత్తు సేవింపవలెను. (పుష్కరమూలము దొరకనియెడల నేలములకవేళ్ళుపయోగింపవచ్చును.)

బూడిద గుమ్మిడికాయ లేహ్యము.

ఈలేహ్యము సేవించిన కుసుమరోగము, బట్టంటురోగము, రక్తపైత్యము, మేహజ్వరములు, స్వరభంగము, క్షయ, మేహకారకాలు, చీరెరోగాలు మొదలగు వాటినన్నిటిని పోగొట్టును. మంచిబలము, ఆరోగ్యము, తేజస్సు, మంచిసంతానము, కలిగించును. ఆయుస్సునుపెంపొందించును. పథ్యముఅవసరము లేకనే సేవింపవచ్చును.

చేసేవిధము.

ముదిరినటువంటిబూడిదగుమ్మడికాయలోనుండుగింజలనుగుంజును, పైపెచ్చునున్న యెత్తివేసి మిగిలినదానిని చిన్న చిన్న సన్నముక్కలుగా తరిగి, ఆముక్కలనొక పాత్రిలోనుంచవలెను. అర్ధశేరునీరు ఆపాత్రిలోపోసి పొయిమీదబెట్టి సూక్ష్మాగ్నితో(సన్నవిమంట) ఉడుకబెట్టి చల్లారనిచ్చి పిదపదాని రసమువేరొక పాత్రిలో పిండిబాగాపిడిచి ఆముక్కలను వేరేగాజాగ్రిత్తపెట్టేది. ఆరసములో పకవీశేము పటికబెల్లము చూర్ణముచేసి పోసేది. అంతట నాపాత్రిను పొయ్యిమీదబెట్టి లేహ్యపాకముగాచేది. పాకముపట్టేపట్నాను పైనడిచి పెట్టియుంచినముక్కలను కళాయిలోకొంచెమావునెయ్యి పోసి అందులోదోరగావేసి, ఆలేహ్యపాకములో పడవేసేది. చక్కగాకలియబెట్టుచుందిడే. దించుకోబోవునప్పుడు ఈకిందచెప్పినవస్తువులుపొడులుపోసి బాగాకలియబెట్టి, అందులో ఆవునెయ్యి పావుశేరు, మంచితేనెపావుశేరు, పోసికలియబెట్టి దింపుకొని జాడీలోగాని, కుండలోగాని జాగ్రిత్తపెట్టి మంచిమూతవేసి పైనగుడ్డ చుట్టి భద్రిపరుచుకోనేది. పూటకు తులము మోతాదు చొప్పున సేవింపవచ్చును. అట్లు 40 దినాలు సేవించి నపైన వివరించిన రోగములన్నియు పటాపంచలై పోవును.

| | | |
|---|---|---|
| దేశవాళి శొంఠిచూర్ణము | ౫ | తులాలు |
| జీలకర్ర | ౫ | ,, |
| దోరగావేయించినదనియ్యాలపొడి | | ,, |
| దాచినచెక్కచూర్ణము | ౫ | ,, |
| ఆకుపత్రికముచూర్ణము | ౫ | ,, |
| యాలక్కాయలలోనిగింజలచూర్ణం | ౫ | ,, |
| మిర్యాలుచూర్ణము | ౫ | ,, |
| తవాక్షీరి | ౫ | ,, |




చలవమిర్యాలు ౫ ,,
చూర్ణించినకుంకుమపువ్వు ౨ తులాలు

### 6 మేహవ్యాధులకు లేహ్యము.

తంగేడుపట్ట చూర్ణము ౧ శేరు, కల్నార అర్ధపావు, జీలకర్ర అర్ధపావుశేరు, పాలసుగంధి పావుశేరు, పెన్నేరుగడ్డ పావుశేరు, ఫిరంగిచెక్క పావుశేరు, మిర్యాలుపావుశేరు, తోకమిర్యాలుపావుశేరు, శొంఠిపావుశేరు, కటకరోహిణి అర్ధపావుశేరు, జాజికాయలునాలుగు, జాపత్రి జాజికాయలంయెత్తు, కుంకుమపువ్వు అర్ధవరహాయెత్తు, లవంగాలు ౧ తులము, పచ్చకర్పూరము అర్ధవరహాయెత్తు, ఈఅన్నిటికిన్ని సమము చక్కెర, ఆవునెయ్యి పాకంగా లేహ్యంచేసి ప్రాత స్సాయంకాలములయందు తులముప్రమాణంగాను సేవించేది. ఇచ్ఛాపథ్యము. నెయి విశేషముగా తగులుచుండవలెను. శూద్రాదులు మేకమాంసము, గోధుమరొట్టె తినవచ్చును.

మరిన్ని గోరోజనము కాలువరహాయెత్తు, కస్తూరికాలువరహాయెత్తు, తాళిసపత్రి, నాగకేసరాలు, నల్లజీలకర్ర, ఈదినుసులు అయిదున్ను నూరి పొంగించి అందులో వేయవచ్చును.

### 7 మేహాలకు చికిత్స

యిసంద్రారి ఆకుపసరున్ను, తెల్లగడ్డలు (అనగా తెల్లనీరుల్లి) నాలుగుపాయలు, నాలుగుమిరియాలు ఇవికలియనూరు కొనిపై పసరులో కలుపుకొని, పసరుకు సరిగా మంచినూనెకలిపి 3 ప్రొద్దుటిపూటలు సేవించేది. పత్యము చప్పిడి. ఆమీద పులుసులేకుండా కందిపప్పు యిచ్చేది.

### 8 సుగంధి లేహ్యము.

[ సమస్తసుఖరోగములకు, మేహరోగాలకు. ]

సుగంధి తు 30 పెన్నేరుగడ్డ 30 ఫిరంగిచెక్క 80, యర్రజా

గ, కారాముదపుదుంప, అనాసదుంప, ముస్తెవపులగము (చిట్టాముద పుచెట్లు) తెల్లగన్నేరు, తెల్లబాడిద, పర్పాటకము, మయూరశిఖి,పూ డుగువేళ్లు, విష్ణుకాంతి, గోరింతవేరు, సాంబ్రాని చెక్క, ఆలతెగడ, నేలగుమ్మడి, బొడ్డువేరు, తెల్లదంతిని, చిత్రమూలము, భటామాంసి దుంపపసుపు, రొయ్యపీత, యిటముంగిచెక్క, పుల్లమండగెడ్డ, తిప్ప తీగి, నేలఉసిరిక, ఆదొండవేరు, కన్యమామిడి, కన్యచేప, పుట్టనందర, నేలముంగ, వాకుడు, ములగ, బరిణెకెచెక్క, గంధంపొట్టు, జిలకర్ర గంటుభారంగి, జాజికాయ, దాల్చినచెక్క కరక్కాయపువ్వులు విష్ణు ముసుకంజా పత్రి, యాలక్కాయ తెచ్చి నలిచి నేసి సగింజలు, లవంగాలు, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు,వట్టివేళ్ళు, పిప్ప లికట్టి, వుశిరికాయలు, కరక్కాయలు, తాడికాయలు, గొబ్బివిత్తనా లు, యవక్షారము, సద్యక్షారము, ధనియాలు, చంగల్వకోష్టు, తుం గముస్తలు, తెల్లజిల్లేడుచెక్క, వరిగోగు, పురుషరత్నం, సాలామిశ్రి సవేద్‌మిశ్రి, నేలతాడి, కన్నెకోమలి, నేలగుమ్మడి, చిట్రిగారం, (భూచక్రి) వాయుడదంగాలు, తక్కోలాలు, కురాసానివాము, ఆకుప త్రికం,తాళిసపత్రికం,దుంపరాష్ట్రము, నస్యరాష్ట్రము, నల్లజిలకర్ర, తవాక్షీరి, పిల్లితేగలు, నల్లవుప్పి, గుంటగలగర, నమలిచెక్క, సునా ముఖి, యీాదినుస్సులు చేర్చి లేహ్యముచేసి సేవింపవలెను. సమస్త రోగములమీాద నడిపించవచ్చును. ఇచ్ఛాపథ్యము నేతి మజ్జిగలుతగు లుచుండవలెను మరిన్ని పైచెప్పబడిన వస్తువులు వస్తువు 1 కి తులము ప్రమాణము చొప్పునవేసేది. ఇంక పంచదార రెండువీశెలన్నర, ఆ వునెయ్యికేరుంబావు, తేనెవకతవ్వెడు, ఇవిలేహ్యముచేసియిచ్చినసమ స్తమైనసుఖసంకటములు, మేహరోగాలు మొదలైన వ్యాధులు, గుణ మౌను.

## 9 ఫిరంగ్యాదిలేహ్యము.

ఫిరంగిచెక్క 30 తులాలు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయలు, తాడికాయలు, ఉశిరికకాయ, తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర సునాముఖి, విష్ణుమధుకం, చంగల్వకోష్టు, తవాక్షీరి, కబాబుచిన్ని, ఆకుపత్రికం, తాళీసపత్రికం, లవంగాలు, యాలకులు (యాలకాయలు తెచ్చివలిచినగింజలె ఉపయోగించవలెను.) జాజికాయ, జాపత్రి, దాల్చినచెక్క, నేలతాడి, కన్నెకొమలి, భూచక్రగడ్డ, నేలగుమ్మడి, గ్రంథితగరము, ఆణబ, నల్లవుప్పి, రేణుకులు, తక్కోలపుబుడ్లు, పిల్లిపీచర, చవ్యము, అడ్డసరము, తెల్లజిల్లేడుచెక్క. కొరిశపాల, తుంగముస్తలు, విలాతిగొబ్బివిత్తులు, పల్లేరుకాయలు, రససింధూరము, అభ్రికము, వంగము, సైంధవలవణము, కురంజివాము, కుసానివాము, వాము, అజామోదమువాము, మాపల్, ఈవస్తువులు తులముప్రమాణము, పంచదార వకవీశెడు, నెయ్యితవ్వెడు, తేనెసోలెడు, పోసి లేహసాకంగావండి దించుకొని సేవించేది.

—:—

## 10. సమస్తరోగములకు

నేలతంగేడు సమూలం తెచ్చి బాగాదంచి వస్త్రఘాళితం చేసి ఒక ముంతలోవైచి యుంచుకోవలెను. మూడునవటాకులుమెత్తు చొప్పున 40 దినములు పుచ్చుకొనవలెను. ఈక్రిందచెప్పబోవు అనుపానవిశేషములతో పుచ్చుకొనిన ఏరోగమయినను మానును. అనుపానము. మేకపాలతో కడుపుసంబంధమైన వ్యాధులకు పంచదారతో చెముడునకు ఇవ్వవలెను ఒంటెపాలతో నపుంసకుడు పుచ్చుకొనిన ఎక్కడలేని మగతనముకలుగును. యిప్పపాలుతోను బాదంఆకు రసముతోడను సేవించిన దివ్యమైన తేజస్సుకలుగును. గుంటకన్నాకురసముతో సేవించిన తెల్లనివెంట్రుకలు నల్లబడును. నేరేడుపండురసాన పెట్టు మందులు ఊడికిందపడిపోవును. వాయువు నొప్పులుగలవారు గురిగిం

జల రసము అనుపానముతోను పల్చబడిన యింద్రియముగట్టిపడుటకు బాడిదపాకురసము అనుపానముతోడను దగ్గులకు నెలదినాలు అక్కల కర్రిరసానను పుచ్చుకోనవలెను. పండుజిల్లేడాకురసముతో సేవించిన మూలాదులుమానును. తెలికపిండి ఉడికెంచిన నీళ్ళతో అయిదురోజు లు పుచ్చుకొన్నయెడల బిళ్ళలుహరించును. తేనెతో సేవించిన శుష్కిం చినశరీరము బలుపు చెందును.

పైత్యమునకు చక్కరతో సేవించవలెను. కుష్ఠురోగులు బెల్ల ము అనుపానముతోను బిళ్ళలకు జాపత్రిడతోను తెలుపురోగానికి ఆవువెన్నతోటిన్ని సేవించేది నిత్యమున్ను వచ్చేజ్వరానికి మజ్జిగతో డను వాతరోగమునకు పిప్పలి మోడి తోడను కడుపు నొప్పికి బెల్ల ము పానకము తోడను రక్తమేహానికి సైంధవ లవణము తోడను అనుపానము పెట్టు మందుకు ఆవు వెన్నతో ఇయ్యావలెను శరీరకాం తిని పురుషత్వమునకును ఆవు నెయ్యితోనియ్యవలెను నోటిదుర్గంధము నకు కర్పూరము తోడను రొమ్ములోమంటకు దానిమ్మగింజలతో డను ఆకలి పుట్టుటకు మాదీఫల రసము తోడను గుంటకన్నాకు రసం తో కడుపులో మంటలకును పాబర్ధజ్వరమునకు ద్రాక్షపండ్లరసము తోడను కండ్ల మబ్బులకు పాచి నీళ్ళ తోడను నెత్తురు బంకకు దాని మ్మ పండ్ల రసముతోను అనుపానము ఆడు జింకపాలతో సేవించిన పండ్రెండామడలదూరమైనను నమువశక్తికలుగును. మిగతవానికిరాయి పురె చక్కెరఅనుపానము. పార్శ్వపునొప్పికి వెన్న, మిర్యాలుతోపు చ్చుకొనవలెను. శీఘ్రప్రసవమునకు లవంగములు అనుపానము. ఇం దుకుపథ్యము—నూనె, ఉల్లిగడ్డలు, నంజువస్తువులు తినగూడదు.

## 11 ఆనందభైరవి.

ఇంగిలీకము, నాభి, పిప్పళ్ళు, వెలిగారము, మిర్యాలు, శొం ఠి, ఈదినుస్సులు శుద్ధిచేసి కల్వానవేసి నిమ్మపండ్లరసాన మూడుగో

జులు విడువకుండా మర్దనచేసి కుప్పెకట్టి భద్రపరుచుకునేది అనుపాన విశేషములతోనిచ్చిన అజీర్తి, అగ్నిమాంద్యము, జ్వరదోషములుహ రించును. మలబద్ధము, మూలశంక, గ్రహణి, నీళ్ళవిరోచనాలు, హ రించును. అజీర్తికివాముురసము అనుపానము. అగ్నిమాంద్యానికి మి ర్యాలరసము, జ్వరదోషాలకు తేనెతోడను, మలబద్ధానికి అల్లపురస మునను, మూలవ్యాధికి తియ్యకంద రసముతోడను, మందుకుసమము గా నల్లమందు గసగసాలరసముతోడను, నీళ్లవిరోచనములకు మందు కుసమానముగ ఇంగువయున్ను, మిరియాలరసముతోడను, ఇయ్య వలెను.

## 12 ఆనందభైరవి (మరియొకవిధము.)

చనుబాల నుడికించిన యింగిలీకము రెండుపాళ్ళు శుద్ధిచేసిన శూద్రినాభివకపాలు, శుద్ధచేసిన వెలిగారమొకపాలు, నల్లమిర్యాలుపా లు, జాజికాయ పాలు ఈదినుసులు కల్వానవేసి నిమ్మపండ్లరసాన ఒక్కదినము మర్దించి మాత్రిలుకట్టి భద్రిపరుచుకొనవలెను. మూడు దినాలువుచ్చుకొన్న గ్రిహణులు, కడుపునొప్పులు మొదలగునవి పోవును.

## 13 మరియొకఆనందభైరవి.

తెల్లనినాభినీర మూతాా్రిన మూడురోజులు శుద్ధిచేసింది రెండు న్నర తులము, రససింధూరము, పిప్పళ్ళు, అక్కలకర్రి, జీలకర్ర, కురంజివాము, లవంగపట్ట, లవంగాలు, మిర్యాలు, వలందాయింగిలీ కము, రసకర్పూరము, ముద్దారుచిన్ని, (ఇంగిలీకం, రసకర్పూరము, ముద్దారుచిన్ని ఈమూడుదినుసులు చనుపాలతో శుద్ధిచేసి తేనెతో నూరి పుఠమువేసేది.) పై అవుషధముల్తోకల్పి మర్దించేది. యీవస్తువు లు యావత్తు సమం అనగా రెండుతులాలపరిమాణము, ౨౦ తమల పాకులరసం, రెండుతులాలరసంపోసి వకదినమునూరేది. ఈలాగుమూ

డురోజులునూరేది. మూడురోజులు మూడేసితులముల రసంపోసి నూరుతూరావలెను. తరువాత నిమ్మపండ్లరసముతో ౧౫దినాలుమర్దనచేసేది. కందిగింజ ప్రమాణంమాత్రలు.

జ్వరము, దగ్గు, జలుబులకు మిరియాలరసం అనుపానము. సూతికాజ్వరములకు తమలపాకు రసంతో ఇయ్యవలెను. జన్నులకు మేహపాడలకున్ను తమలపాకురసంతోను, శగవల్లవచ్చిన కన్నునొప్పికి చీనాపంచదారతోడను, యియ్యవలెను. మరిన్ని కొరుకు, (ఉపదంశము) బిళ్ళ వగయిరాలకుసైత మియ్యవచ్చును.

### 14 ఆనందభైరవి—ప్రకారాంతరము.

ఇంగిలీకము, వెలిగారము, నాభి, మిరియాలు ఈనాల్గుదినుసులు శాస్త్రరీత్యాశుద్ధిచేసి సమభాగాలు తీసికొని కల్వానవేసి, మూడుదినాలు వేపవేరుపట్ట రసాన విడువకుండామర్దించి కుప్పెలుకట్టి భద్రపరచుకొనేది. శీతపైత్యజ్వరాలకు కందిగింజయెత్తు ఔషధము తీసికొని ప్రొద్దున అల్లపురసము అనుపానముతో ఇచ్చి, సాయంకాలము మిర్యాలరసానుపానమునను పుచ్చుకొనవలెను. మేహపైత్య జ్వరాలకు మేహజ్వరాలకు జీలకర్ర రసంతోగాని, ధనియాలరసమునగాని, దాల్చినిచెక్కరసానగాని యియ్యవచ్చును, ,,నానానుపానసహితం సకలామయఘ్నమ్,, అనిచెప్పియున్నందున సమస్తరోగములకు అనుపానాది విశేషములతో సేవించిన సమస్తరోగహరము, ఇచ్ఛాపథ్యము, కాని, నూనె పదార్థములు, పులుసు, ఆవ, బచ్చలి, గుమ్మడి, గోంగూరవగైరాలు, వర్జించవలెను.

—§—

## 15 గోడాచోరి.

రసము ౨పా, తాళకము ౧½రపా, నాభి ౧పా, శూద్రి నాభి ౧పా, మణిశిల. గంధకం ౧పా, త్రిఫలం ౩పా, త్రికటుకము ౩పా, వెలిగారము ౩పా, నేపాళము ౨పా, పాషాణము ౧పా, ఈపస్తు వులుగుంటగలగరపసరున ౧ దినము, బాడిదాకురసాన ౧ దినము, చిత్రిమూలపురసాన ౧ దినము, కల్వములో బాగామర్దనచేసి మినప గింజప్రమాణంగామాత్రిలుచేసి, నీడనారనిచ్చి, వెదురుగొట్టములో ఉంచి భద్రిపరుచుకొని, ఆయావ్యాధులకు ఈక్రిందివివరములప కారిరము అనుపానాదులతో నియ్యవలెను.

నీరుడు బంధించిన ఆవుపెరుగుతోనియ్యవలెను. తీపివర్జంవాయువుకు అల్లపురసానను. బెల్లమునర్జము, కడుపులోపురుగులుకు వాయులవంగాలతోను బెల్లంతో మూడుదినాలుయిచ్చేది. శుక్లమేహములకు ధనియాల కషాయముతో ఏడుదినాలుఇచ్చేది. వాయువునొప్పులకుఇంగువపొడితో, చచ్చువాతమునకు మూడుచిన్నాలెత్తు మహిసాక్షిపొడితోడను, శగరోగమునకు రేవల్చిన్ని, ఉసిరికరసమునను ఇచ్చేది. కడుపులోమంటకు ౧౮ దినాలు వేపయీనెలు రసమునను నోటికంపునకు, నాలుకపగుళ్ళకు దానిమ్మఆకు రసమునను, పంటినొప్పులకు అక్కలకర్రి, గుంటకలగర అకురసములను తలనొప్పికి శొంఠి పిప్పళ్ళు మిర్యాలతో మాత్రిఅరగదీసి పట్టువేసేది.

## 16 కదళీపాకము.

అరటిపండు దుంపరసము, వావినాకురసము, యుబ్బికలువదుంప రసము, గుంటగలగరరసము, కొబ్బరికాయనీళ్ళు, ఈరసాలు సోలెడు సోలెడు ప్రిమాణం, శొంఠి ౨ తులాలు, పిప్పళ్ళు తు౨లు, మిర్యాలు తు౨లు, కరక్కాయ తు౨లు, తాడికాయ ౨తులాలు, ఉశిరికపప్పు తు౨, యాలకుగింజలు తు౨, సోపు తు౨, సహాజిరా౨

చన్యము తు-౨, నరాటిమొగ్గలు తు-౨ మోదుగుమాడలు తు-౨ గసగసాలు తు-౨ జీలకర్ర తు-లు తవాక్షీరి తు-౨ ధనియాలు తు3 కిశిమిశిపండ్లు తు-౨లు ద్రాక్షపండ్లు తు-౨ను తేనెగిద్దెడు, ఆవునెయ్యి గిద్దెడు, పంచదార అరవీశెడు, ఇవిపాకంబట్టి లేహ్యమువండి, గచ్చ కాయంత ప్రమాణముచొప్పునసేవించేది. నిక్కాకలు, కుసుమవ్యాధులు హరించును. ఇచ్ఛాపత్యము.

## 17 వంగభస్మం

తగరం ౮ తులాలు కరిగించి తులమున్నర నల్లమందు క్రిందా మీదా బాగా లేపనముచేసి చింతబెరడులో పుటము వేయవలెను.

## 18 తాళకభస్మము.

తాళకమును ముళ్ళతోటకూర రసమున డోలాయంత్రమున వండవలెను. మూడు పర్యాయాలు వండిన తాళకము ముక్క మెరిబడును. దానిని మూడు దినాలు తెల్లపుప్పిపళ్ళ రసముతో గాని తెల్లవుప్పి ఆకు రసముతోగాని మర్దించి బిళ్ళచేసి ప్రమితలో బెట్టి చీలమన్ను యిచ్చి బొగ్గులలోపుటంవేసేది. భస్మమగును. ఆభస్మమును ౧ వడ్లగింజ ప్రమాణం గాని బియ్యపుగింజప్రమాణము గాని యెత్తుకొని తేనె నెయ్యి అల్లపురసము ఈ అనుపానాలతో యిచ్చేది. ఉబ్బులు కాస శ్వాస అతిమూత్రములు మానును. ఇచ్ఛాపత్యము.

## 19 లోహభస్మము

ఉక్కుపొరాడి మెదనీరుతోమర్దించి (మూడుజాములు) తరువాత మూసలోవుంచి పుటము 50 పిడకలతో వేసేది మూడుపుటాలు చెయ్యవలెను.

—§—

20 పచ్చకర్పూరము చేయుక్రియను

పరిశస్తమైన గన్నపల్కు ఆరతికర్పూరములు, తెల్లని సాం బ్రాణి అరతులము. కచోరాలు పావుతులము. పచ్చాకు పావుతుల ము. గవుళాలు పావుతులము. మిర్యాలు పావుతులము. యాలికిగింజ లు పావుతులము. జటామాంసిపావుతులము. చలవమిర్యాలు పావుతుల ము మయిసాక్షి పావుతులము, లవంగాలుపావుతులము, చంగల్వకోష్టు పావుతులము, జాపత్రి పావుతులము, పటికపావుతులం, జాజికాయపా వుతులం, కుంకుమపువ్వు పావుతులం, మంచిగంధంపొట్టు పావుతుయ్యా తెల్లగుగ్గిలం పావుతులం, కస్తూరి 2 గురివింతగింజలుయెత్తు ఆవునెలం, పావుశేరు మెత్తగానూరి ముద్దచేసి ఆముద్దను రాగిపళ్ళెములోనుంచి ఆపైని పింగానీగిన్నె బోర్లించి గిద్దెడు నేతితో దీపముయెలిగించి ఆదీ పముమీద యీతబుకుప్రంచి వండవలయును ఆపాగ పింగానీగిన్నెకు పట్టును కందికంపతో పట్టవలయును.

21 శిలాజిత్తుభస్మము.

మెర్రకలువ దుంపరసాననూరి యెండబెట్టిన శిలాజిత్తుశుద్ధిఅగు ను. ఆపైన నేలములగ ఆకురసాననూరి గజపుటమువేసిన భస్మ మగును. తిరుగాకలబందరసాన వ్రాసి పుటమున్ను, శతావరి (పిల్లితే గలు) రసానవకపుటమున్ను, తెల్లగజ్జేరురసాన వకపుటమున్ను, వేయ వలెను. పూటకు బేడయెత్తుచొప్పున మోతాదు. అనుపాన విశేషము లవలన సమస్తమేహములమీదను వాడవచ్చును.

22 శృంగి భస్మము—మూత్రకృఛ్రములకు.

దుప్పికొమ్ములు చిన్న చిన్నముక్కలు క్రిందకొట్టి పుట్టపాలాకు రసములో నానవేసి ౩౦ పిడకలచేత పుటము వేసిన భస్మమగును. ఆ భస్మము మూత్రకృఛ్రముల మీద బహు చక్కగా నడుచును.



## 23 లోహసింధూరము.

లోహభస్మము దానిమ్మ పువ్వుల రసముతో మర్దించి తరువాత అంతరతామరతో మర్దించి 50 పిడకలతో పుటము వెయ్యవలెను చిందూరించును.

## 25 అగస్త్యకొళంబు

(అనుపానవిశేషములను అన్నివ్యాధులమీద నడుచును.)

ఇంగువ అరతులము ఆవాలు అరతులము యిందుప్పు అరతులము పాదరసము అరతులము వెలిగారము అరతులము మణిశిల అరతులము పిప్పళ్ళు అరతులము తాళకము అరతులము నల్లజీలకఱ్ఱ అరతులము నేపాలాలు నాలున్నర తులము (పచ్చివి కొన్ని ఆముదములో వేసినవికొన్ని) మజ్జిగ అన్నము తింటా మూడుదినాలు నూరవలయును. ఇచ్ఛాపథ్యము. పెద్దవాండ్రకు సెనగ గింజ ప్రమాణం చిన్న వారలకు అందులో సగము మోతాదియ్యవలెను.

అనుపానములు—జ్వరానికి శొంఠిసాయము దగ్గులకు కరక్కాయ కషాయము రక్తభేదికి ఆవునెయ్యితో పెద్దకడుపునకు, శోభకు, పాండురోగమునకు, నీరుకారుటకు, ఉబ్బసమునకు, మిర్యాలపొడి తెల్లవుల్లిపాయల కషాయముతోడను యిచ్చేది. జన్నికి తేనెతో అల్లపురసముతో, సుఖజన్నికి బిడ్డను కన్నదానికి జిల్లేడాకు వాడ్చి మిరియాల గింజల రసములో కంటికెరసమువేసేది. కన్నుమెరయితే కరబుదగుజురు గంధం మూడుపట్లువేసేది. రాచపుండునకు, రొమ్మునొప్పి, శూలనొప్పి, పక్కశూల, మెడసూవ, చెద్ది, గజ్జి, వడిశగడ్డరణాలు, మూలశంక, చన్నునొప్పి, వీటిఅన్నిటికి మొంగిలితో రంగరించి వేయవలెను. [సూతికవాయువులకు] ప్రసూతికి, వాతశూలనొప్పికి, గుల్మము, కడుపునొప్పికి, సకలగుల్మరోగాలకు, వావిలాకురసముతో, ఇయ్యవలయును. దగ్గుకి, పిన్నిసుకి, గంజాయిఆకురసాన ఇ

య్యవలయును. శిరోవాతము, నొప్పికి, పిశాచముపట్టినదానికి, పాముగాని, తేలుగాని, కరచినవానికి బట్టవత్తిచేసి ముక్కులో వదలవలయును. నీరుడిరాకుండ నుండిన మొగలిరేకు కషాయంతోను, ఆడదాని రోగములో నీరుడిరాకుండావుండినదానికన్ని, చిట్లపిరంగి, మురకుండాకురసముతో గర్భానికి,-చోళ్ళుఆవుపాలతో నూరెచిన్నరూకయెత్తుమందు మూడుదినాలియ్యవలయును. ఇంటికె దూరమయిన సూతికవాయువులు, జ్వరానికి, మేకపిత్తములో జీలకర్రపొడివేసి యియ్యవలెను. వళ్ళువాచినదానికి నావిలాకురసంతో, శొంఠి, రసంతో మిర్యాలు పిప్పళ్లు వీటితో యిచ్చేది. బేదిగాని అధికమయితె వసకాల్చి నేతిలో రంగరించి నాకించేది. పత్యము—చాప నూనె, నజ్జువస్తువులు తినకూడదు.

ధూపవిధి శిశువులకు

ఈక్రిందివస్తువులు సమమూర్చిధూపమువేయుచుండిన పశి పిల్లలకు గాలి, గ్రహబంధము ఏమీరాయుండవు. రక్షవేశేఅక్కరలేదు.

26 పంచపల్లవాలధూపము

జమ్మి, మర్రి, అత్తి, రావి, మామిడి, వీట్లఆకులుయెండించి చూర్ణంచి డబ్బిలోపోసికొని యుండేది.

27 గ్రహాలకు—ధూపము

నేరేడుఆకు, ముషిణిఆకు, మామిడిఆకు, జిల్లేడాకు, పావిలిఆకు మేడి, అత్తి, వేప, మగబీర, మైసాక్షి, కారుఇంగువ, తెల్లఆవాలు, ఇవన్ని చూర్ణించి ధూపంవేసిన గ్రహాలు తొలగును.

28 దశమూలకషాయము.

కొలపొన్న, నేలపొన్న, చిన్నములక, పెద్దములక, మారేడు, కక్కలి, తుండిలము, కలిగొట్టు, నేలగుమ్ముడు, ఈదినుస్సులు కషాయముపెట్టి పిప్పలిచూర్ణముతోటి యియ్యవలెను. వాతశ్లేష్మజ్వ

తము, సూతికదోషము, సన్నిపాతజ్వరము, పక్కశూల, మెడపట్టు తలనాదు, సోమరితనము, ముష్ణగుణవిహరించును.

29 వాతజ్వరానికి గుడూచ్యాది కషాయము.

తిప్పదీగ, పొట్ల, చేదుపొట్ల, దూలగుండ, తుంగముస్తెలు, పర్పాటకము, వేపపట్ట, నేలవేము, త్రిఫలములు, అడ్డసరము, ఈదినుస్నులు కషాయముపెట్టి సేవించినహరించును.

30 పిత్తజ్వరకషాయము.

తిప్పతీగ, వేము, ధనియాలు, పద్మకము, రక్తచందనము, ఈ దినుసులు కషాయముపెట్టి సేవించిన పిత్తజ్వరమువిడుచును.

31 మరొకవిధము.

పర్పాటకము, రక్తచందనము, వట్టివేళ్ళు, శొంఠి, ఈవస్తువులు సమభాగాలు కషాయముబెట్టి సేవించిన పిత్తజ్వరముహరించును.

32 శ్లేష్మ జ్వరమునకు కషాయము.

అడ్డరసము, శొంఠి, మరదగొండి, తుంగముస్తలు, ఈదినుస్నులుసమభాగాలు, కషాయంబెట్టి సేవింపను శ్లేష్మజ్వరమువిడుచును

33 వాతపిత్తజ్వరహరకషాయము.

చిన్నములక, బెద్దములక, కోలపొన్న, నేలపొన్న, పల్లేరువేళ్ళు తిప్పతీగ, తుంగముస్తలు, శొంఠి, నేలవేము, ఈదినుసులు సమాంశాలు కషాయంపెట్టి సేవించిన వాతపిత్తజ్వరము హరించును.

34 శీతజ్వరకషాయము.

తగరపువిత్తులు, కొడిశపాల, తిప్పతీగ, వావిలాకు, గుంటకన్నాకు, శొంఠి, చిన్నములక, అజామోదము, వీనికషాయము సేవించినశీతజ్వరము విడిచిపోవును.

35 జ్వరహర కషాయము.

దేవదారు, ధనియాలు, శొంఠి, పెద్దములక, చిన్నములక, ఈ

దినుసులు సమభాగాలు, బాగాదంచి యెన్మిదోవంతు మిగులునట్లు కషాయంపెట్టి సేవింపవలెను.

36 శీతజ్వరములకు కషాయము.

గీ. రామలక్ష్మణసీతయు రావణుండు
త్రిశిరోకుంభకర్ణ విభీషణుండు
కలిసి రేనియుశీతంబు కఫముశీత
జ్వరములాదిగమానును జపములకును.

తా॥ ములక, వావుడు, నల్లగుగ్గెర, నేలవేము, గుమ్ముడు, తాడికాయ, కూర్చిఅష్టావశేషముగా కషాయము బెట్టితాగిన శీతజ్వరాలుమానును.

37 దశావతార కషాయము.

సీ. మత్స్యకూర్మంబును మఱివరాహంబును
నరసింహమును వామనంబు రామ
రామరామయుబౌద్ధ రాజిల్లుకల్కియు
సంగతంబైనను సకలరోగ
ములుమానుకావ్యధంబు ముదమున సేవింప
భైరవమూర్తియు భీమసేన
వీరభద్రుడుకార్తవీర్యుడు రాముడు
హనుమంతషణ్ముఖవైనతేయ

గీ. నారసింహులుమొదలుగా నవమహాత్ము
లెలమిగూడిన పాండుక్షయంబుమఱియు
పిత్తకఫమాది జ్వరములుపేరణంగు
రాయసముపేరకవి నేలురామలింగ.

తా॥ కటకరోహిణి, నేలగుమ్ముడి, నేలతాడిగడ్డ, అడ్డసరం కర్కాటకశృంగి, పెద్దములక, నేలములక, శొంఠి, పొన్నగంటి నార

సింహా, అడ్డసరము, కార్తవీర్య-తెల్లరికె, హనుమంతు,—దూలకోవెల షణ్ముఖ, ఉలిమిడి, వైనతేయ, నేలగోలిమిడె, ఈదినుసులుకషాయం పెట్టియిచ్చిన పాండుత్రిరోగ జ్వరాలు హరించును.

సమస్తజ్వరాలకు కషాయము.

గంటుబారంగి, తుంగగడ్డలు, దూలగుండ, పర్పాటకము, నేలవేము, శొంఠి, పిప్పళ్ళు, చంగల్వకోష్టు, నేలములగ, తిప్పతీగ, అడ్డసరపుయీనెలు, ఈదినుసులు సమభాగాలు బాగుగా కోట్లోవైచి దంచి కషాయముపెట్టి పుచ్చుకొనవలయును.

39. సమస్తజ్వరాలకు తరుణార్కరసము

శుద్ధిచేసిన గంధకము, అభ్రకభస్మము, వెలిగారం, శుద్ధిచేసిన నాభి, ఉమ్మెత్తగింజలు, నల్లతాత్రిచు విషము, రక్తచందనము, వంము, ఇవి సమాంశాలుతీసికొని ఈవస్తువులన్నిటికిని సమముగ శుద్ధిచేసినయింగిలీకమును చేర్చి మూడురోజులు మాదీఫలగసాన నూరి మర్దనచేసి ఆవగింజంతేసి మాత్రలుకట్టి అనుపానవిశేషములతో సమస్తజ్వరాలకు వాడుకొనవచ్చును.

40 విషమజ్వరాలకు కషాయము

మాత్రినుపసుపు, దేవదారు, కొడిశ, రక్తనందనము, కస్తూరి, ఏలల, విషబొద్ధి, కచ్చూరములు, పిప్పళ్ళు, పిల్లిపీచర, నేలవేము,గజపిప్పళ్ళు, కాత్రినుగు, పద్మకము, ధనియాలు, శొంఠి, తానికాయ, సరసరళదేవదారు, శీఘ్రి, [నీటివట్టివేరు,] జలము, నేలములగ, కరక్కాయ, వాకుడు, పర్పాటకం, కటకరోహిణి, దర్భవేళ్లు, సుగంధిపాల, తిప్పతీగ, పుష్కరమూలము [మెట్టతామరదుంప] ఈదినుసులు కషాయముపెట్టి పుచ్చుకొనవలయు.

ఇందుసమానేవి—అతిదారుణజ్వరాలు, ధాతుదోషమువలన జనించిన జ్వరాలు, త్రిదోషజ్వరాలు, ఏకాహికజ్వరము, త్ర్యాహికజ్వరమున్ను మొదలుగాగలవి.

41 విషమజ్వరహరము

అక్షసరము, వాకుడు, తిప్పతీగ, తుంగముస్తలు, శొంఠి, ఉశిరిక వలుపు, ఈదినుసులు, కషాయించి, తేనె, పిప్పళీచూర్ణముతోటి సేవింపను విషమజ్వరముపోవును.

42. తాపజ్వర చికిత్స

ఉత్తరేణివేళ్ళు, ఊడుగువేళ్ళు, కొండపండివేళ్ళు, పిల్లిపీచర, తిప్పతీగె, ఈవస్తువులు సమభాగాలు కషాయముపెట్టి పుచ్చుకొనిన తాపజ్వరము, దాహము, వాంతులు, పోవును.

43 జ్వరచికిత్స

కటకరోహిణి నాల్గుతులాలు, మిర్యాలొకతులమున్న నూరె గుంటకన్నాకురసము అర్ధశేరుపోసి మర్దనాచేసి గురిగింజలంతేసి మాత్రలుకట్టి సేవించేది జ్వరములుహరించును. శొంఠి, మిర్యాలు అనుపానము.

44 శీతజ్వరములకు - లక్ష్మీనారాయణరసము.

శుద్ధిచేసినగంధకము, శు॥ తామ్రభస్మము, శు॥ మైలతుత్తము, శు॥ వెలిగారం, ఇవిసమభాగములు కల్వానవేసి గలిజేరు రసముదీసిఆ రసాన రెండుదినాలు రాత్రిం బగళ్ళు నూరవలెను. పిమ్మటడోలాయంత్రమునవండి మాత్రలుకట్టి పూటకురెండుమాత్రలు చొప్పున వాడవలెను.

45 లంఘనములలో వాంతులకు చికిత్స.

గుప్పెడుతెల్లజీలకర్ర రోగికిమునుగిడి పొగవేయవలెను.

46 వాతపిత్తశ్లేష్మ జ్వరహర కషాయము.

పర్పాటకము, వట్టివేరు, గంధపుచూర్ణము, గులాబిమొగ్గలు, వేపయీనెలు, ఇవిసమభాగాలు శేరునీళ్లలోకాచి పావుశేరుకుమరిగినంత అందుకొంచెము సైంధవలవణమువేసేది.పూటకుఅరసోలడుగాని గద్దెడుగాని పుచ్చుకోవలెను. పథ్యములేదు.

### 47 పాళిజ్వరచికిత్స-(వరుసజ్వరము)

పాదరసము సమూలంతెచ్చి నీడనెండించి చూర్ణముచేసి భద్రపరచుకొనేది. ఆపుపాలలోవేసి ఆచూర్ణముకలిపి మూడుపూటలు గానిఅయిదుపూటలుగాని సేవించిన చలితోవచ్చువరుసజ్వరాలుహరించును.

### 48 లంఘనము చేయతగినవారు.

గర్భిణీస్త్రీలు, అతిసారరోగులు, శిశువులు, వృద్ధులు, విస్తారమునడిచి అలసినవారు. విస్తారము శ్రీమపడినవారు. కృశించియున్నవారు, గ్రిహణపీడితులు, క్షయరోగులు, నేత్రరోగములవారు,

### లక్ష్మినారాయణరసము.

తామ్రభస్మము, గంధకము, మైలతుత్తము, వెలిగారము,ఈ దినుసులు అయిదుసమభాగాలు, బాగాశుద్ధులుచేసి కల్వానవేసి, రెండుదినములురాత్రింబగళ్ళు గలిజేరురసానూరి, డోలాయంత్రమునఒకజాముసేపువండి, మాత్రలు మిరపగింజంతేసికట్టి టపూటకురెండేసిమాత్రలువంతునసేవింపవలెను. చలిజ్వరాలుహతమగును. అనుపానవిశేషములతో వాడవచ్చును. ఇదిలఘుతరము.

### 50. సన్నిపాత భైరవి

స్వర్ణముతోతుల్యమైన శుద్ధిచేసిన తాళకము ౧ తులము, శుద్ధగంధకము ౧ తులము, శు॥ పాదరసము, ౧ తులము, శుద్దనాభి 3 మూడు తులాలు, మణిశిల శు॥ ౧ తులము, వెలిగారం పొంగించినది. ౧ తులము, తు చెప్పిన దినుసులయొక్కయెత్తుకు సమంగా అనగా ౮ తులాలు శుద్ధిచేసిన ఇంగిలీకం పెట్టి కల్వానవేసి, నిమ్మపంఢ్లరసమున రెండుదినాలు రాత్రింబగళ్లు నూరి, ఒకదినము చిత్రమూలరసాన మర్ధించి, జాముసేపు డోలాయంత్రమున వండి పూటకు మినుపగింజప్రిమాణముమాత్ర, అల్లపురసము, మిర్యాలరసము, శొంఠి

వాములరసములు మొదలైన అనుపానవిశేషములతో ఇయ్యవలెను. ఇందునపూనేవి. విషమదోషజ్వరాలు, కఫరోగాలు, పదిమూడుసంధులు, ప్రిబలమగు వాతరోగాలు, దగ్గు వెక్కిళ్ళు, తలనొప్పి, తాపము, కడుపునొప్పులు మున్నగునవి,

## 51. వైష్ణవీరసము

వసనాభి ౧ పాలు, ఇంగిలీకము ౧ పాలు, కటకరోహిణి ౧ పాలు, శొంఠి ౧ పాలు, మిర్యాలు, ౧ పాలు పిప్పలి ౧ పాలు ఈదినుసులు, కల్వాన వైచి చిత్రిమూలములరసమున బాగా మర్దించి ఒక్కజాము డోలాయంత్రమున వండవలెను. మాత్రాప్రిమాణం రెండు గురిగింజలయెత్తు విష్ణుకాంత కషాయముతో ఉదయము సాయంకాలములందు ఒక్కొక్కమాత్ర చొ॥ ఏడుదినములు సేవింపవలెను. సమస్తరోగములు హరించును.

## 52 అతిసారజ్వరానికి—విషూచికి.

ఇంగిలీకము పిప్పళ్ళు నాభి సమభాగాలు వీటికి సమం పొంగించిన వెలిగారము ఈవస్తువులు నిమ్మపండు రసాన మర్దించి చోడిగింజంత మాత్రి కట్టి వకమాత్రి చన్నీళ్ళతో యిచ్చిన జ్వరాతిసారాలు విషూచులు మానును.

## 53 జన్నికి చికిత్స

తెల్లగన్నేరు వేరుపై బెరడు తీసి నల్లమిరియాల పొడుము మునగచెక్కజిగురు ఈ మూడువస్తువులు మాత్రిలు చేసి కడుపులోనికి యిచ్చేది. మరిన్ని తొడలు వీపునకు బాగా మర్దనచేసేది.

## 54 జన్నికి మరోచికిత్స

ఇంగిలీకం ౧౮ తులం నల్లమిర్యాలు ౧తులం చిత్రిమూలం ౨తులాలు ఈమూటిని మునగచెక్కరసాన నూరి మిరప గింజప్రిమాణము మాత్రిలు కట్టి పుదీనా ఆకు కషాయముతో ఇచ్చేది. దాహంగా

వున్న యెడల పోయిసూర విత్తనాలు బట్టలో మూట గట్టి కాగు చుండే నీటిలో ఆమూట వేసి బాగా కాగనిచ్చి యంతట మూట తీసివేసి ఆనీళ్ళు తాగుటకు యియ్యవలెను. ఆకలి ఉన్న సోడ గంజి యియ్యవచ్చును.

## 55 దోషగుణాలకు చికిత్స.

దుష్టుపుచిగుళ్ళు గచ్చచిగుళ్ళు వుప్పిచిగుళ్ళు గోరోజనము నల్లమందు కుంకుమ ముులగపువ్వు యింగువ యజ్జ్ర యివిభాగావేయిం చిగచ్చకాయ ప్రమాణం మాత్రలు చేసి ఇయ్య వలెను. దోషగుణా లు హరించును.

## 56 గ్రహణికి దానం

అగ్నిమాంద్యమువల్ల గ్రహణిరోగము జనించును. అగ్ని మాంద్యము అధికముగ తినుటవలన తిన్న అన్నము జీర్ణముకాకుం డుట వలన మలమూత్ర వేగమున బంధించుట అధికసంభోగము చేయుట అహిత కరభోజన సేవమున్నగు వానివలన కలుగును.

### లక్షణములు.

వాతగ్రహణి పైత్యగ్రహణి శ్లేష్మగ్రహణి సన్నిపాతజగ్ర హణి ద్వంద్వగ్రహణి త్రిదోష గ్రహణి అని తెలియవలెను. అందు వాతగ్రహణికి చీము జిగురు రక్తము కలిపి పడును. అందు రక్తమధి కముగానుండును. మూడవ గ్రహణికి రక్తమునకు రక్తమే పడును. ద్వంద్వలక్షణముగలది ద్వంద్వగ్రహణి వాత పిత్త శ్లేష్మలక్షణ ముయి గలది త్రిదోష గ్రహణి

మలము యెరుపురంగు గలిగి నురుగు తోగూడి జిగట నొప్పి ధ్వని మొదలగు వాటితోగూడి యుండిన వాతాతిసారము. మలము దుర్గంధము గల్గి యెర్రగగాని ఆకుపచ్చగగాని లేతపసుపు వర్ణముగ గాని నీలివర్ణముగ గాని వెడలు చుండిన పైత్యాతిసారమని యెరిగేది.

ఇందు శూల తాపము మూర్ఛ చమట పట్టుట దప్పి చేతులు కాళ్ళు మంట గల్గియుండును. ఇక శ్లేష్మాతిసారమున మలము తెల్లగాను గట్టిగాను కఫయుతముగను ఆమగంధ యుక్తముగను గగుర్పాటు చుట గల్గియుండును.

మలము పందికొవ్వు వలెగాని మాంసము గడిగిననీళ్ళవలె గాని యుండి పైచెప్పిన లక్షణములు గలిగియున్న సన్నిపాతాతి సారముకష్టసాధ్యము మఱియు తేనెవలెను ఉప్పునీరు చీము మాంస ము వీనితో తుల్యముగనునానా వర్ణములుగగాని దుర్గంధ యుతమై మలము వెడలుచున్న అసాధ్యమని యెరుగవలెను. మలము మిశ్రివర్ణ ము గనున్నను నల్లగనున్నను అసాధ్యమని యెరింగేది.

## 57 గ్రిహణి—చికిత్సలు

కరక్కాయలోనిపప్పు చింతగింజలపై బెరడు తీసినపప్పు సమ భాగాలు చక్కగా నూరి ఆవు వెన్నకరిగించి అందులో పై జెప్పిన వస్తువుల చూర్ణమున పోసేది. తంతు పాకము వచ్చినతరువాత దించి జాగ్రత్త పెట్టేది. పూటకు చిన్న మెత్తు చొప్పున అనుపాన విశేషాల తో నిచ్చిన గ్రిహణులు అతిసారములు నివర్తించును.

## 58 మరొకవిధము

శొంఠి, లవంగాలు, వెలిగారం, (పొంగించినది) జాజికాయ, నల్లమందు, ఈదినుసులు నాలుగున్ను నాలుగు అరతులాలు తీసుకొని మెత్తగామర్దించి నూరేది. గసగసాలతోటికూడా ఆవెనుకమర్దించి శనగగింజలంతేసిమాత్రిలుచేసి భద్రపరచేది. పూటకు రెండుమాత్రలు చొప్పున పటికిబెల్లము చూర్ణించి ఆచూర్ణముతో శేవించేది.

## 59., గ్రహణులకు, అతిసారములకు చికిత్స

మిరియాలు పిప్పళ్లు, వెలిగారం, శుద్ధిచేసిన ఇంగిలీకం, శుద్ధి చేసిన నాభి, శుద్ధిచేసినగంధకము, శుద్ధిచేసిన ఉమ్మెత్తగింజలు, సమ

భాగాలు తీసుకొని కల్వములో గంజాయి ఆకురసాన నొకజాము చక్క గామర్దించి సెనగగింజలంతేసి మాత్రిలుకట్టిసేవింపను గ్రహణులు అన్ని అతిసారాలు, హరించుటగాక, తీవ్రిజ్వరము, అగ్నిమాంద్యము గూడ హరించును. ఇందుకు పథ్యము—పెరుగు, మజ్జిగ, అన్నము

60, లోకనాథరసము

శుద్ధిచేసినరసము, వసనాభి, గంధకము, వెలిగారం, లోహభస్మము. జాజికాయ, ఆరెపువ్వు, లవంగపుచక్క, చిత్రిమూలము, జీలకర్రి, శొంఠి, సైంధవలవణము, పిప్పళ్ళు, మామిడిపప్పు, బూరుగుబంక, మారేడుపండువేళము, తుంగముస్తలు, అతివస, ఈదినుసులు ఒక్కొక్క భాగముచొప్పునను, శుద్ధిచేసినవల్లమందు పదుభాగములును, వీటిఅన్నిటికి సమంగా అభ్రికభస్మమునుచేర్చి, కల్వాన వేసి ఒకజాము నల్లఉమ్మెత్తవేళ్ళ పట్టకషాయాన మర్దనాచేసి రేగుపండంతేసి మాత్రిలుకట్టి భద్రిపరుచుకొనేది, ఇందున కుదిరేవి అనుపానవిశేషాలతో సేవించవలెను. చాలకాలమునుండియున్న గ్రిహణులు, అతిసారాలు, అగ్నిమాంద్యముహరించును. సమస్తమైన అజీర్ణములకు తేనె అనుపానముతో ఇయ్యవలెను.

61. బాలుర అతిసారములకు

వరిపేలాలు, ఆరెపువ్వు, సుగంధిపాలు, లొద్దుగచెక్క, సమభాగాలు చూర్ణముచేసి పూటకు పావుతులంచొప్పున తేనెలో కలపి నాకించేది. పిల్లలకు వచ్చినఅతిసారము హరించును. అతిసారమనగా విరేచనాలు.

62 ఉదరరోగ చికిత్సలు.

అగ్నిమాంద్యము వలన సమస్తరోగములు జనించును. మాలిన్యమై పచనముగాని యన్నమును తినువలననేమి, హితకరముకాని

పథార్థములు సేవించుటవలన నేమి, మలాదులను క్రిమముగాపోకుం డ అడ్డగించుట వలననేమి ఉదరరోగము పుట్టుచున్నది.

జలముతోగూడి ఉదరము మిక్కిలి పెరుగుట, చేతులు, కాళ్లు కృశీతనుజెందుట, బొడ్డువాచియుండుట, ఈలక్షణాలుండిన జలోదీదర మని యెరుగుంనది.

63 జలోదర చికిత్స.

పిప్పలిని చూర్ణముచేసి కొంతచెముడు పాలలోవేసి బాగాగలి యజేసి అటుట పిమ్మట నెండబెట్టి దానిని బియ్యపుకడుగుతో అయిదు చిన్నాలయెత్తు వారమురోజులు పుచ్చుకొనవలెను.

64 బల్లలకు, జలోదరములకు.

వెఱ్ఱిపుచ్చకాయలో (ఉప్పుకాయ) పావలాయెత్తు పటిక, రెం డు తులాలు లోహమును పెట్టి, చక్కగా చీలమన్నిచ్చి జానెడు చద రముగల గోతిలో పంద్రెండు పిడకలతో పుటము వేయవలెను. పిమ్మ టతీసి చల్లారనిచ్చి కల్వానవేసి మర్దనాచేసి మాత్రిలుకట్టి భద్రిపరు చుకొనేది. మాత్రి కుంకుడు గింజసుమారుగా నుండ వచ్చును. నాలుగుపూట లిచ్చిన లేదా ఆరుపూటలు పుచ్చుకొనిన కుదురును. గుల్మాలు, పరిణామశూల మొదలగు రోగములు కూడా హరించును.

65 కడుపులోని బిళ్లలకు.

చేదు సొరకాయ పెంకును యెండించి చూర్ణించి గాజుసీసాలో భద్రపఱచి యుంచుకొనేది. పెద్దవాళ్లు గాని అయినయెడల యాగా నియెత్తు చొప్పునను చనుపాలతో యియ్యవలెను. చన్నీటితోకూడా యీయవచ్చును. ఇచ్ఛాపథ్యము.

66 కడుపులోని బల్లలకుచికిత్స.

తెల్లగలిజేరు సమూలముగ చూర్ణించి ఆచూర్ణమునకు నాలు గోవంతు సింధుప్పుపెట్టి ఆవునేయివేసి వండి పుచ్చుకొనిన కడుపులోని బల్లలు హరించును. చప్పిడిపథ్యము. తెల్లగలిజేరునకు పునర్నవనిపేరు.

67 శూలలకు చికిత్స.

చిత్రిమూలము, ఇంగువ, అగలు శొంఠి, కోష్ఠు, పంచలవణాలు, జీలకఱ్ఱ, కొడిసి మెరలు, పిప్పళ్లు, మోది, తోట్లవేరు, కురాసాని వాము, మంచి వామం, గంటిబారంగి ,యవక్షారము, సద్యక్షారము, లవంగపత్రి, పల్లేరువేళ్లు, దేశవాళి జీలకఱ్ఱ, ఇవి సమంగా చూర్ణించి, నిమ్మపండ్లపులుసున నూరి, తాంద్రికాయంత వటుకాలు చేసి, నీడను యెండించి, భోజనము అయినవెనుక, తేనెతో వకమాత్ర కల్పి తినేది. ఇందున మానేవి:—ఉదావర్తశూల, పార్శ్వశూల, హృదయశూలలు మానును.

68 కడుపు నొప్పికి.

నల్లమందు ౧ తులం, దుష్టుపాకుచిగుళ్ళు ౧ తులము, రాతిసున్నము ౧ తులం, ఈ దినుసులు మూడు కల్వానవేసి మెత్తగా నూరి చిన్న రేగుపండంతేసి మాత్రలుకట్టి జీలకఱ్ఱ రసము అనుపానముతో వాడవలెను. టకీట్టమని కడుపునొప్పులు కట్టును.

69 పరిణామశూలలకు.

సురేకారం, త్రికటకములు, వెల్లుల్లి, గచ్చపప్పు, యింగువ, వాము, (వేయించేది) మజ్జిగలోనూరియిచ్చిన పరిణామశూల మానును

70 శూలలకు చికిత్స.

కారింగువ, గోరోజనము సమభాగాలు నూరి, మిరపగింజంతేసి మాత్రలుచేసి నొప్పివచ్చినప్పుడు ఉడుకునీళ్ళతో యిచ్చేది. నెయ్యి, పులుసు, వర్జము.

71 గుంటనొప్పికి.

స్త్రీ ఇంటికె దూరముగానున్న ప్పుడు కానుగుచెట్టురసము తీసి ఆరసములో తెల్లపుల్లిగడ్డలు సన్నముగాతరిగి వేసి, పొయి యెక్కించి

వండి ఆవుపిల్లిగడ్డలు భుజించేది. నీస్లకొంచెము తాగవచ్చును. మూడు రోజులు, కడుపునొప్పిపోవును.

72 ముట్టయినప్పుడు వచ్చు కడుపునొప్పికి.

ఉసిరి కాయంత గాని, నిమ్మకాయంత గాని పాతబెల్లమును వేసికొని, జిల్లేడుచెట్టువద్దకువెళ్లి ఒకఆకులో ఆబెల్లమునుడుంచి, సాంబ్రాణి పొగవేసి, ఆచెట్టుపాలు బెల్లము నిండా పట్టించి, బాగా నలిపి మాత్రలుచేసి మూడుపూటలు యియ్యవలెను. ఆప్రకారం రెండోమాసం కూడా ఇయ్యవలెను.

73 ఋతుశూలకు

ఆవునెయ్యి పంచదార తెల్లజిల్లేడుపువ్వు పాలకాడ దుంప ఇవి సమముగాచేర్చి తేనెను దానిలో నాలుగవ వంతు కలిపి బాధవచ్చినప్పుడు మొదలు 2 మాసాలు సేవింపవలయును. ప్రతి మాసమునందు బహిష్టు అయినప్పుడు రోజుకు మూడు మారులు మందు సేవించేది.

74 సంతానానికి

సరస్వతీ ఆకు జాజికాయ జాపత్రి కురంజివాము వరగోగుపువ్వు, వీనిని ఎండబెట్టి దంచి వస్త్రకాళితంచేసి పదిమాసములు తినవలయును. సంభోగము విస్తారముగా నుండకూడదు. పరిమితిగా నుండవలయును.

75 కడుపులోనుండు మనిషికి నెత్తురువలె నీరుడిపడుచున్నందుకు

పాలు, వేడినీరు, నీరుల్లిపాయ, పాలగింజలు, వీనిని సమభాగములుగా పదునుచేసుకొని మూడుదినములు సేవింపవలయును. పథ్య చప్పిడి.

76 పుత్రసంతానానికి

సంతానమునకు చేసినమందులో కొంతభాగమును 5 మాసములుతిని ఆపిమ్మట నల్లమిరియాలు చిత్రమూలము ఇంగిలీకము

త్రికటుకములు వట్టివేళ్ళు వీటిని కలిపి సేవించి తక్కువకాలము పురుష సంపర్కమును మానవలయును.

77 సంతానమునకు చికిత్సలు.

పాలు వేడినీరు తేనె ఇంగువ రసకర్పూరము వీనిని సమాంశములుగాచేర్చి 10మాసములు సేవింపవలయును. దానికి పద్యము సామాన్యము.



78 సంతాన ప్రాప్తికి.

ఎఱ్ఱనిపువ్వులుగలనల్లేరువేరునూరి, నిమ్మకాయంతముద్దచేసి, అందులోసగంజీలకఱ్ఱనూరి ముద్దచేసిఈరెండు ముద్దలువేడినీళ్లలోకలిపి, ఆదివారమునాడుగాని, స్నానముచేసిననాడుగాని యిచ్చేది. సంతాన ప్రాప్తి

సుగంధపాలవేళ్ళు, శ్రీగంధము, లొద్దుగచెక్కగంధము, చంగల్వకోష్టు, ఇవిదినుసునకు మాడెత్తు చొప్పునచూర్ణించి తరికడుగున త్రాగనియ్యవలెను.

79 గొడ్డుబోతుకు.

జనపవిత్తనాలు నానబోసి, పచ్చిపసుపుకొమ్ము, బూరుగుపువ్వులుఇవినీళ్లతోనూరి మాత్రకట్టి యివ్వవలెను.

80 కడుపులో చచ్చినపిండము బైటపడుటకు.

ములగవేరు, మిర్యాలు, తరవాణితో నూరి త్రాగించిన పడిపోవును.

81 ఋతుశూల నిదానము.

నియతినతిక్రమించిన ఆహార నిద్రాసంగమాదులవలనను, వాతప్రకోపమువలనను, సుఖసంకటాలు శరీరమున జీర్ణించినందువల్లను,

ఇంకనుమరికొన్ని యితరకారణములవల్లను, స్త్రీగర్భాశయమునకు సంబంధించియున్నపిండస్థానము, రజస్సు, చెడుటవల్లను, బహిష్టనియయముతప్పుట, ఎక్కువగగాని, తక్కువగగానిమైల ( రజస్సు) పోవుట, వాకిటినున్నప్పుడు కడుపునొప్పిబాధ యెక్కువగనుండుట, శూలగల్గియుండుటవలనను—

వెన్నునొప్పి, కాళ్ళుపీకు, శిరస్సుమంట, కన్నుమంట, పలురంగులసారివము, నిస్సత్తువ మొదలగునవి చెడుగులు.

## 82 ముట్టునొప్పికి చికిత్స.

తెల్లగచ్చకాయపప్పు, చెఱుకుబెల్లం, ఈరెండు రెండరతులాలు, నూరి మాత్రిలుచేసి మూడురోజులు రేపట మాపటా ఒక్కమాత్రిచొప్పున పుచ్చుకొనేది.

## 83 గంటునొప్పికి చికిత్స-

ఇంటికిదూరంగానున్నప్పుడు జుట్టుపాకురసం అర్ధపావులో (అరసోలెడురసంలో) 7 మిర్యాలునూరి కలిపి మూడుదినాలుతాగించేది.

## నేత్రిరోగములకు—

## 84 మరీచాంజనము.

మిరియాలుభాగము ఉశిరికపప్పు 2 భాగాలుగానుగవిత్తనాలు 3 భాగాలు ఇవి కల్వాన వేసి గుంటకలగరాకు రసంతో మర్దించి నూరి కణికలుగా చేసి ఉంచుకొనేది. నేత్రాంజనమిడి కొన్నకన్నులు కానరాకుండుట పొరలు మొదలగునవి పోవును.

## 85 పగటియందు నక్షత్రిములగుపడుటకు—

శుద్ధిచేసిన మణిశిల పచ్చకర్పూరము పిప్పళ్ళు పాతచింతపండు గానుగ గింజలు ఈదినుసులు నీటితోనూరి కన్నులకు పెట్టుకొనేది.

## 86 రేచీకటికి కంటిపొరలకు చికిత్స.

కలువపూలు సైంధవలవణం రక్తచందనము త్రిఫలాలు ఇవి నిమ్మపండ్లరసాన భాగామర్దనచేసి అంజనము చేసికొన్న చీకట్లుకమ్ముట పొరలు రేజీకటి హరించును.

## 87 నయనామృతము — సర్వనేత్రరోగాలకు,

పచ్చకర్పూరము శుద్ధిచేయబడిన సవీరాంజనము శుద్ధిచేసిన మైలతుత్తము రసాంజనము మాత్రినిపసుపు కటుకరోహిణి గవ్వలు సయింధవలవణము త్రికటుకాలు సముద్రింనురుగు యష్టిమధుంకము శ్రీగంధము శంకం ఇవిసమభాగాలు కల్వంలో మాదీఫల రసాన మర్దించి కణికలు చేసేది. నేతితోగాని తేనెతోనైనా నైచెప్పిన కణి కనరగదీసి కంటికి పెట్టుకొన్న సమస్తనుయిన నేత్రరోగములు హరించును.

## 88 నోటిదుర్గంధమునకు చికిత్స

కఫము పిత్తము వ్రికోపం వల్లకంతమును నోటిని దుర్గంధము కొట్టును చికిత్స————మాదీఫలరసంలో నెయ్యి గాని తేనె గాని కల్పి తాగినను కరక్కాయలు సదావ చంగల్వకోష్టు పిప్పలి వీటి చూర్ణము గోమూత్రాన కలిపి కాచితాగినను కలిలో పంచదార కలిపి గండూషించినను నోటకంపుహరించును.

## 89 త్రిదోషహారి

అభయాదివటుకములు.

శ్లో॥ అనిలంకుపితం గుడతైలయుతం
మధుశర్కరయా సహాసైత్యమపి
మధుపిప్పలిభిః కఫయాకురుతే
శమయేశమయే శమయేదభయః

కరక్కాయలు చూర్ణించి వటకములుచేసికొని భద్రపరచుకొని వాత పరికోప దోషములకు బెల్లము నూనె అనుపానముతోడను పైత్యసంబంధ మైనరోగమునకు తేనె శర్కర అనుపానము తోడను పిప్పలి తేనెలతో శ్లేష్మరోగముల మీదను వాడవలయును త్రిదోష జనితములు సర్వరోగములు హరించును. ఇచ్ఛాపత్యం

## 90 గుల్మాలు, వాతాలు, మలబద్ధాలుకు.

ఇంగిలీకం ౫ ౨ యెత్తు, రసకర్పూరంగ ౨ యెత్తు, రససింధూరం ౫ ౨ యెత్తు, కటకరోహిణి ౧ పలము, తెల్లకాచు ౧ పలం, వక్కలు ప ౨ లు, వాముము ౨ పలాలు, తమలపాకులకట్టవకటి, యీఆకులరసముపోసి, పై చెప్పినదినుస్సులున్నూ, పెద్దపావరకాయలు అయిదువిత్తనములుతీసి మిగిలిన గింజలున్నూకలపి నూరి వడియాలు పెట్టేది. నిత్యమున్ను వకవడియముపొడిచేసి నీళ్ళతోటిపుచ్చుకొనేది. ఆవ, అవిశ, ఆరికన్నం, గుమ్మడి, నూనె, వర్జితము. తక్కినవస్తువులు భక్షింపవచ్చును.

## 91 విరేచనములు, వాంతులుకు

రసకర్పూరం ౧ వరహాయెత్తు, నల్లమందు ౧ న్నరవహాయెత్తు గోరోజనం ౨ వరహాలయెత్తు, శొంఠి ౧ వరహాయెత్తు ఈదినుస్సులు చనుపాలతోమర్దించి పెసరగింజప్రమాణం మాత్రలుచేసి బేదులుఅగుచుండునప్పుడు చనుపాలతోఇచ్చేది. వాంతిఅయినట్లయిన ఖర్జూరపుకాయలోనిగింజనుతొలగించి అందులో ౧ ౪ వరహాయెత్తు నల్లమందుంచి ఆఖర్జూరపు కాయచుట్టూ గోధుమపిండిపాదిగి పుటమువేసి తరువాత ఖర్జూరపుకాయమతీసికొని మీద పొదగిన పిండినితొలగించి ఆకాయనుచూర్ణించివుంచుకొని వాంతిఅయినప్పుడున్ను, దాహముఅయినప్పుడున్ను, నీళ్ళలో ఆచూర్ణంకొంచెమువేసి దాహానికియియ్య

వలెను. గొమ్ముసకు మంచిగంధము పూయవలెను పిమ్మట పుదీనారసమున్ను నిమ్మకాయలరసమున్ను తేనె కలిపి నాలుగై దుసార్లు కషుపులోనికియిచ్చేది. ఆకలిగొన్నప్పుడు కొంచెంబియ్యంవేసి, అందుకొంచెంశొంఠివేసిబియ్యపుగంజికాచియియ్యవలెను.

## 92 వాంతికిచికిత్సలు.

జిల్లేడుపాలలో బెల్లమునానవేసి యిచ్చినవాంతికట్టును. తిప్పతీగతెచ్చి కషాయంబెట్టిఅందు 6 చుక్కలు తేనెనైచిపుచ్చుకోవచ్చును. తిప్పతీగత్రిదోషహరము గనుక త్రిదోషజనితమగు వాంతులుకట్టును. మరిన్ని మారేడుచెక్క కషాయంలోగాని పర్పాటకం కషాయంబెట్టిగాని, అందుకు 6 చుక్కలుతేనెనైచి త్రాగించిన డోకులుకట్టును.

## 93 మేహించిరక్తమువలె విరేచనమగుచుండినందుకు చికిత్స

ఆవుపాలలో నిమ్మపండురసముపిండి కలిపి త్రాగించిన విరోచనముకట్టును. వాంతియునుకట్టును. నెమలిపురికాల్చి తేనెతో గలిపి నాకించిన వాంతికట్టును.

## 94 బేదికి నూనె (పిల్లలకు)

చిట్టాముదము పావుసేరు, బొంతజెముడుపాలు చటాకు, తెల్లయెర్రిగడ్డలరసముపోసి పొయిమీద బెట్టి కాగనిచ్చి, చోళ్ళరొట్టెచేసి అందులోవేసి ఆరొట్టెపదునుగాఉడికినతరువాత దించుకొనేది. పెద్దవాళ్ళకు తులమెత్తు నడివయస్సువారికి ముక్కాలు దుడ్డుయెత్తు, అంతకు తక్కువప్రాయమువారికి యాగానియెత్తు చొ॥ నూనెయిచ్చేది.

## 95 బేదికి చికిత్స

చెముడుపాలలో బెల్లంనానవేసి యియ్యవలెను. మజ్జిగ అన్నం తినవలెను.

### 96 చిన్నపిల్లలు విరేచనాలకు

—♦—

ఆరెపువ్వు, మారేడుపిందెలు, లొద్దుగచెక్క, గజపిప్పలి, వట్టివేళ్ళు ఈదినుసుల కషాయంలోగాని, కలకములోగాని, తేనెవేసియిచ్చిన పిల్లలకు విరేచనములు కట్టును.

### 97 బాలసంజీవినీచూర్ణము

(జ్వరం, అతిసారం, దగ్గుఉబ్బసం, వాంతి, హరించుటకు)

పిప్పళ్ళు, మంచిష్ట, తుంగముస్తలు, కరకపువ్వు, సమాంశాలు చూర్ణించి తేనెతో ఇయ్యవలెను.

### 98 కస్తూరి మాత్రలు

సూతికాభరణము, వాతరాక్షసము, వాతవిధ్వంసి, సన్నిపాతం, కస్తూరి. జున్ను, సాముజేరు, గోరోజనము, రససింధూరం, రొయ్యపీత, తాబేలుసనకట్టు, మొసలిపేడుకట్టు, ఇవిసమాంశాలుమెత్తుకొని తమలపాకులరసాన బాగా మర్దించి కందిగింజంతేసి మాత్రలుకట్టి అనుపానవిశేషాలను వాడేది.

### 99 బాలసంజీవినీమాత్రలు

౧ తులం రసకర్పూరము, ఇనుపగరెటలోవేసి చనుపాలుపోసి పొయిమీదబెట్టి ఇగిరేవరకుకాచిన శుద్ధియగును. దానినికల్వములో నుంచి మెత్తగానూరి, శెనగగింజంతతడి సున్నమున్ను, చాలినన్ని తమలపాకులు తొడిమలున్నువేసి బాగా మర్ధించవలెను. మినప గింజం తేసిమాత్రలుచేసి పూటకొకమాత్రి చొ॥ గానిరెండుమాత్రలుగాని చనుబాలుతోనూరియియ్యవచ్చును. మరిన్నివిరేచనముతెల్లగాఅగుచుండిన ఆకుపచ్చవర్ణముగనసమారును. తరువాతపసుపుపచ్చరంగుకు మారును. అప్పుడు అజీర్ణి హరించినదని తెలిసికొనేది. ఈమాత్రలు చంటిబిడ్డలకు సంజీవివంటివని వేరెచెప్పనక్కరలేదు.

### 100 శిశువులకు—ఉబ్బసములకు

లంవంగాలు, పిప్పళ్ళు, జాజికాయ, జాపత్రి, చక్కెర, పెద్ద గుమ్మిడికాయరసం వీటినన్నిటిని ఏకముచేసి ఆవునేతితో నాకింపవలెను ఇందువనపసిపిల్లలకు వచ్చుఉబ్బసములు హరించును.

### 101 దగ్గు—ఉబ్బసమునకు

వెఱ్ఱిపుచ్చకాయ ౧ చేదుబీరకాయ ౧ ఈరెంటిలోని గింజలు తొలగించి కాయలను చూర్ణంచేది. చేదు సొరకాయతెచ్చి గింజలు తీసివేసి, బత్తాయి సారాపోసి, అందుపై చెప్పిన చూర్ణం పోసి, మూతవేసియుంచేది. దినానికి ఒకగంటెడు చొప్పున ఇయ్యవలెను నాల్గురోజులు తియ్యని పప్పులతోపత్యము.

### 102 ఉబ్బసపు దగ్గుకు

ఏడుమిర్యాలు, నాల్గువెల్లుల్లిపాయలు, దుష్టుపాకు పసరులో బాగానూరి మాత్రిలుకట్టి ప్రొద్దుట మధ్యాహ్నం, సాయంకాలము, లయందు మూడుమాత్రిలు [అనగాపూటకొకమాత్రి] చిట్టాముదము లోముంచి పుచ్చుకొనవలెను. ఉబ్బసపు దగ్గుహరించును.

### 103 అన్నిదగ్గులకు

తాళకంగడ్డ కొత్తసున్నంలో సాయంకాలమువరకు నానవేసి, ఒకదినముగుఱ్ఱపుమూత్రానానవేసి, ఆపైనముదారరెల్లచెట్టుచెక్కకాల్చిబూడిదచేసి ఆబూడిదపెత్తలోపోసి, పైనచెప్పినతాళకంగడ్డనునడుమ పెట్టి, పైనబూడిదకప్పి మూతమూసి, చీరమన్నిచ్చి, జానెడులోతు గొయ్యిలోపిడికలుపేర్చి పుటముబెట్టితీసికొని, చూర్ణించి, మోడి, ధనియాలువీటిచూర్ణం చిటికెడు చేతవేసికొని, అందుపై చెప్పిన చూర్ణం అర్ధగురిగింజయెత్తు వేసి అందుమీదకొంచెం తేనెవేసి, నాకంచేద. ఇచ్ఛాపత్యము.

## 104 దగ్గుకు చికిత్స.

చిత్రమూలము 2 వంతులు, రససింధూరము, వాముపొట్టు గోరోజనము, రేలచెక్క, వాకుడువేళ్ళు, ఇవి సమభాగాలు, ఈదినుసులు చనుపాలతో బాగా మర్దించి పెసరగింజంతేసి మాత్రలుచేసి పిల్లలకిచ్చిన దగ్గులు మాయమగును.

## 105. నెత్తురుదగ్గు - రక్తకోశ.

ముళ్ళడుస్తికాయరసం 1 శేరు, శొంఠి పిప్పలి మిర్యాలు సమభాగాలు చూర్ణించిపైపసరులోబోసి వండి, 15 దినాలుప్రాతఃసాయంకాలముల ఉశిరిక కాయప్రమాణంసేవించేది. కందిపప్పు, మేక మాంసము మున్నగునవి పథ్యము.

## 106 నీళ్ళవిరేచనాలుకట్టుటకు.

అజామోదము, అల్లము, బూరుచెట్టుజిగురు, ఆరెపువ్వు ఇవి చూర్ణించి యిచ్చిన నీళ్ళవిరేచనాలు కట్టును- పెరుగులోనైచియిచ్చేది.

## 107 త్రిదోషహరచికిత్స.

3 తులాలు శొంఠి, 3 తులాలు మిర్యాలు, అర్ధశేరు ధనియాలు బాగాదంచి ఆచూర్ణము మూడువేళ్ళతోమెత్తుకొని తవ్వెడునీళ్ళలోవేసి అరిసోలెడుకు మరగనిచ్చి గుడ్డతోతేర్చి, పరగడుపుపుచ్చుకొన్న వాతపైత్యశ్లేష్మము హరించును.

## 108 గవదబిళ్లలకు చికిత్స.

చెముడుచిగుళ్లు గుప్పెడు ముందుగా మూడుప్పుకళ్ళతోతినిపించి అవిశాకుపసరుగాని, బాడిశపాకుపసరుగాని రాచిన కరిగిపోవును. తెల్లగన్నేరుపాలు గవదలకురాచిననుపోవును. పైనదూదిఅంటించవలెను.

109 ఉమ్మకుసర్పికి చికిత్స.

తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, పాలసుగంధి, తెల్లజిల్లేడువేళ్ళునూ రిఆవునేతిలో కలిపి పట్టించవలెను. సురుగుడు నేతిలోనూరి పట్టించేది

110 గోర్చుట్టుకు.

పసుపు సున్నము మర్ధించి చుట్టున్ను పట్టించేది. కట్టుకట్టేది మరిన్ని నిమ్మపండుకంధ్రింవేసి వేలికితగిలించేది. ఆపులుపునకేచక్క పడును.

111 తలమీదికురుపులకు.

వెంపలివేరుచూర్ణించి అందువెన్నకలిపి రాచుచుండిన కురుపులు మాడిపోవును.

112 చనుకుకురుకుచికిత్స.

నల్లమేకపాలతో చిట్టాముదం సమూలంగానూరి ఆముదాస ఉడికించి కట్టనుహరించును.

113 కర్ణశూలలకు చికిత్స

తేనె సైంధవలవణము తెల్లావనూనె అల్లపురసముతోకలిపి నూనె మిగులు నట్లుకాచి (అనగా రసంఇగిరిపోవును.)కొంచెము వెచ్చ వెచ్చగా చెవిలో వేసిన కర్ణశూల హరించును.

114 చెవిలో చీముకారుచున్న

నేరేడు మామిడి యిప్ప మర్రి ఈవృక్షాల చిగుళ్ళు కల్కముచేసి నూనెకలిపి కాచి చెవిలో నైచిన చీముకారుట కట్టును.

115 చెవిలోని కురుపులకు

రుద్రజడాకు రసము నిమ్మపండురసము ఆరెటెక్క రసము సమ భాగాలు చెవిలో పోసిన కురుపులు చితికి చెక్కకట్టి మానిపోవును.

### 116 శరీరపుష్టికి

నేలతాడి పెన్నేరు పంచదార ఇవిసమభాగాలు మాషప్రమాణమును పాలు నెయ్యి పంచదార అనుపానముతో పుచ్చుకొన్న మంచి పుష్టికలుగును.

### 117 స్థూలరోగచికిత్స

తిప్పతీగ కరక్కాయ తుంగముస్తలు ఇవిసమభాగాలు చూర్ణించి ఈచూర్ణమునకు సమంగా లోహభస్మముచేర్చి కర్షప్రమాణం తేనెతో పుచ్చుకొనిన స్థౌల్యము హరించును.

### 118 ఉబ్బుకామెర్లకు చికిత్స

కాకరాకు పసరుతీసిగిద్దెడు ఆవుపెరుగులో నాల్గుచుక్కలు పిండి మూడు ప్రొద్దుటిపూటలు పుచ్చుకొనేది పత్యం లేదు.

### 119 చిన్నపిల్లల కామెర్లకు

దున్నపోతు పేడతెచ్చి గుడ్డలోవైచి పిండిరసంతీసి ఆరసం ౧ పలము బఱ్ఱెపెరుగులోకలిపి త్రాగించేది. 2 గాని 5 గాని ప్రొద్దుటిపూటలు చేయించేది.

### 120 కలికము.

ఆముదపు గింజపప్పు నలిచి సానమీద చాదినేత్రాలకు వేయవచ్చును.

### 121 అదృశ్యం

కాకిగుడ్డు పాదరసము పోసి నూరి తిలకము పెట్టుకొన్నయెడల అదృశ్యము.

### 122 కళ్ళకలకకు.

ముసాంబ్రము, నల్లమందు, పటిక సమభాగాలునూరి కంటిచుట్టుపట్టువేసేది. కొంచెంగాకాచవచ్చును, చప్పిడిపత్యము పైవస్తువు

లో తుమ్మాకుపసరు, దుంపపసుపుకూడా సమభాగాలుచేర్చి పట్టువే యవచ్చును, పత్యముచప్పిడి, పోటున్నా, మెఱుపులు, వొరుపులు, దురద, నీరుకారుట, మెరయుట, నలకబడ్డట్టున్నా, పోటున్నా హరిం చును.

123 కంటిదృష్టికి అంజనము (కాటుక)

పచ్చకర్పూరము పాతికవరహాయెత్తు, కొండపువ్వులు అయిదు ఆవువెన్నతో మూడు రోజులు రాగిపాత్రిమీద బాగామర్దించి తీసి కొమ్ముడబ్బిలో జాగ్రత్తపెట్టుకొనేది, కంటికికాటుకపెట్టుకొనేది.

124 కలికము.

నల్లమేకపోతు నీసకట్టులో ౧౦ మిరియాలు ఊరవేసి తీసికొని ఆమిర్యాలను నల్లగాడిదె పాలలో తిరిగిమూడు దినాలునానబెట్టి తరు వాత ఆమిర్యాలుయెత్తు వెల్లుల్లిపాయల రసంతీసి ఈరెండున్ను తమల పాకులరసముతోటి మర్దించి చిన్నపెసరగింజలంతేసి మాత్రిలుచేసి నీ డను ఆరబెట్టి తమలపాకులరసాన నూరి కంటికి అంజనం వేయవలెను. ఇందునమూనేవి జన్నిన్ని, పిశాచమున్ను విడుచును.

125 కంటికికాటుకనూనె.

తేనెరెండుపలాలు, ఉశిరికతోలు 2 న్నరపలము, కరక్కాయ చెక్కలు అరపలము, తెల్లమిరియాలు పలము, చలవమిరియాలు ౧ పలము, లంవంగాలు ౧ పలము, పచ్చకర్పూరము అర్ధవరహాయెత్తు మూడుయెడనీరుకాయలు, కావిరాయిఫలంవేపచెక్కగాని, శ్రీగంధం కాని నిమ్మకాయప్రిమాణం, ఈదినుసులలో కావిరాయి,గంధం, క ర్పూరంమినహాగా తక్కినదినుసులు మర్దించి వస్త్రకాళితంచేసిపిమ్మట వేడినీళ్ళుపోసి పైమూడు దినుసులువేసి వెన్నవలెమెత్తగానూరి బిళ్ళ చేసి రాగితాంబాళముపైనబెట్టేది. చిట్టాముదము దీపంక్రిందపెట్టేది.

తెల్లగలయినపిమ్మట తేనెపోసి రాగిచెంబుతోగాని రాగిపంచపాత్రతో గాని నూరి అటుపిమ్మట కుండలోవేసి పొయిమీదబెట్టి బాగాపాకం రానిచ్చిదించుకొనేది. కల్వములోమూడుదినాలు నూరి జాగ్రత్త పెట్టుకొనేది.



126 కండ్లు కలిగినందుకు

పటిక, వెలిగారం, ముసాంబ్రము, నల్లమందు, సమభాగాలు నిమ్మపండురసముతో నూరి కంటిచుట్టుపట్టువేయవలెను.



127 కనుబొమ్మనొప్పికి

దూలగొండివేరు నూరిపట్టించిన నొప్పితొలగును.

128 కాకిపొమ్మలకు

ఆముదంవేళ్ళు, వెల్లుల్లిపాయ, యీరెండు దంచిరసముముక్కులో పిండేది. బాగౌను.

129 పీసరదిగినందుకు చికిత్స

అతివస, మాశేకుపింజు, కర్కాటకశృంగి, దాల్చినిచెక్క, విరజాజిపువ్వు, నాగకేసరాలు, రససింధూరము, ఇవిసమభాగాలు నీళ్ళతోనూరి, బిళ్ళచేసి రావిఆకుతో చుట్టూమూసివేసి అయిదు ఆరు పొరలు తరువాత నిప్పులమీద పెట్టి క్రిందను మీదను కాలనిచ్చి నూరి శనగగింజప్రమాణము మాత్రలుకట్టి ప్రొద్దుట సాయంకాలముల ఇచ్చేది. ఇచ్ఛాపత్యము.

130 మూత్రకృఛ్రమునకు

మిరియాలు, పిప్పళ్ళు, యాలకులు సైంధవలవణం, వీనిచూర్ణము, తేనె పంచదార కల్పి శిశువులకునాకించిన మూత్రకృఛ్రములు మానును.

### 131 శిశురక్షిణి

వట్టివేళ్ళు నేరేడుచిగుళ్ళు మామిడిచిగుళ్లు మత్తికోసలు, ఇవి దినుసునకు తులం చొ॥ తెచ్చియెండించి ౧ గిద్దలనీళ్లుపోసి గిద్దెడుకు కాచి వడియగట్టి తేనెతో శిశువులకు నాకించిన జ్వరము, అతిసారము కక్కుట, మూర్ఛ బడలిక ఇవిమానును. ఇచ్ఛాపత్యము.

### 132 గుదభ్రంశ నివారిణి

వాతదోషమున నిదిజనించు. దానికి నెయ్యిచమిరిలోనికి తోయవలెను. వాతహరమగు ఆకులను కట్టవలయును. మరిన్ని బ్రిహ్మమేడికాయలుగాని అంతరదామరనుగాని సోలెడు లేక అరపంపుతొక్కి ఉడుకబెట్టికట్టేది. గుదభ్రంశము పోవును.

### 133 గండూషణము.

లవంగాలు ఏలకులు జాజికాయ జాపత్రి దాల్చినచెక్క ఆకుపత్రికం తాళిసపత్రి అక్కలకర్ర చలవమిర్యాలు పిప్పళ్ళు శొంఠి మిర్యాలు కబాబుచిన్ని యష్ఠిమధుకం తవాక్షీరి రుద్రాక్షులు జీలకర్ర వీనిని సమభాగాలు చూర్ణించి తేనెతో నాలుగుజాములు మర్దించి సీసాలో భద్రపరచు కొనేది. దీనిని ముళ్ళు పెరిగివున్న నాలుకపై రాయవలెను. ఆపైనిబంగారు రేకుతో నాలుక గీచుకొనేది. తిరుగా ఔషధం నాలుకకు వ్రాయవలయును.

### 134 నోరు యిగురుకు జిహ్వాదోషమునకు,

వస వాము యింగుపుగింజ అక్కలకర్ర అతిమధురము వీనికషాయముతో పుక్కిలించవలెను

## 135 జిహ్వాదోషాలకు

పర్పాటకము శొంఠి మిర్యాలు వామును సమభాగాలు కషాయం పెట్టి త్రాగించేది. మరియు కన్నెకోమలి నిమ్మగింజలోతిచి అంద దలిపప్పు కలియనూరి తేనెతో చిప్పమెత్తు యియ్యవలెను.

## 136 నాలుకముళ్లుగానున్నందుకు

రుద్రాక్ష పగడం ఈరెండు తియ్యదొండాకు పసరులో అరుగదీసి నాలుకకు రాయవలెను. బాగా రుద్రాక్షతో నాలుకగీచుకొనేది.

## 137 ఫణిదంత చూర్ణము.

పటిక పలుకుసాంబ్రాణి సమాంశాలు చూర్ణించి అవసరమగు నంత తుమ్మచెక్క చూర్ణమును చేర్చి డబ్బీలో జాగ్రత పెట్టుకొని దంతములను తోముచుండిన నెత్రుకారుట అరుచి కంపుతొలగును.

## 138 పక్షవాతమునకు (లకా)

శిరీషపు ఆకురసంలో ఆవాలు యింగువ కలిపినూరి త్రాగించను. పక్షవాతము నివారణ మగును.

## 139 ఉపల్ జార్ కేశాలంకార్.

తంగేడాకురసం ౧ పాలు నువ్వులనూనె ౧ పాలు ఈరెండు గిన్నెలోపోసి పొయిమీదబెట్టి రసము యినికేవరకు కాచించి (సూక్ష్మాగ్నితో కాచవలెను.) కస్తూరిపసుపుపొడి 13 కిచ్చిలిగడ్డ పచ్చాకు పొడి గాళాలు వీటిచూర్ణము. వేసి చల్లారనిచ్చి వడియగట్టి సీసాలో గాని సిడతలోగాని భద్రపరచుకొనేది. తలఅంటునకు తలమెరుగుకు ఉపయోగించును. సువాసనగలిగి వెంట్రుకలను వృద్ధిచేయును. శిరో

రోగాలు మాయమగును. మెదడునకు మిక్కిలి చలువనిచ్చును. దీనికిదేసాటి.

## 140 అగ్ని మాంద్యమునకు చికిత్స

మూషుతులాలు అల్లపురసమునందు మంచితేనె మూషుతులాలుకలిపి పుచ్చుకొన వలెను. అనంతరము మాంసము నెయ్యి భుజింప వచ్చును.

## 141 చింతామణిరసము.

శుద్ధిచేసిన రసము శుద్ధిచేసిన గంధకము తామ్రభస్మము అభ్రక భస్మము త్రిఫలాలు త్రికటుకాలు మరిన్ని శుద్ధిచేసిన నేపాళాలు ఈదినుస్సులు సమభాగాలు కల్వాన తుమ్మి పూలరసముతో బాగా మర్దన చేసి భావనచేసి యెండబెట్టి వస్త్రఘాళితంచేసేది మోతాదు ఒక గురిగింజ యెత్తు లేదా రెండుగురిగింజల యెత్తు మాత్రము పుచ్చుకొనేది. ఇందున యెనిమిది రకములతి జ్వరాలు హరించును. ఆమవాతము హతమగును. అజీర్ణవ్యాధులు శూలలు అన్నియు పోవును.

## 142 అగ్నిదీపనమునకు

అల్లపురసము నిమ్మపంటి రసము సమభాగములు ఆరసములో సైంధవలవణము కొద్దిగా వేసి భోజనము చేయడానికి ముందుగా పుచ్చుకొను చుండ వలెను.

## 143 దీపనమునకు

చింతపండు చిత్రమూలము శొంఠి పిప్పలి కరక్కాయ మిర్యాలు వాయు విడంగములు సైంధవము బిడాలవణము ఓమము

నల్లజీరకము తెల్లజీరకము సౌవర్చ లవణము ఈదినుసులు సమభాగాలు చూర్ణించి పుచ్చుకొనవలెను.

### 144 క్షీరషట్పలఘృతము.

దశమూలముల రసము ఘృతము (నెయ్యి) క్షీరము (పాలు) పంచకోలాలు క్షారము వీటినికలిపి సేవింపవలెను. అగ్ని మాంద్యము వాతపిత్తజనిత కఫరోగాలు జ్వరము కాసపాండు ప్లీహము మున్నగు రోగములు హరించును.

### 145 యిరుకులకు బెణుకులకు

వేపాకు ఆముదముతో వెచ్చజేసి నాలు గైదు కట్లుకట్టిరక్తంచక్రమణము కలిగి నొప్పులు హరించును.

### 146 బెణుకులకు

గజ్జేరాకు తెచ్చి నలగకొట్టిగాని చేతితో నలిపిగాని ఆపసరు బెణుకు ప్రదేశముల రాచిన బెణుకునొప్పులు రెండుసార్లకు హరించును.

### 147 దంతవ్యాధులకు చికిత్సలు

గవ్వపలుకు సాంబ్రాణి ౧ తులము మైలతుత్తము ౧ తులము పటికి ౧ తులము తెల్లకాచు ౧ తులము ఈదినుసులను చూర్ణించి నీటితడితో వేలికి అంటుకొనివచ్చినంత మసిరాచుకొన్నట్లు రాచుకొనేది. ఆపయిని తాంబూలంవేసికొనేది. శొంఠి అరగదీసి అందులో సైంధవలవణము కలిపి పట్టువేసిన పల్లుకురుపులుమానును.

### 148 చిగురువాపు చికిత్స

సైంధవలవణము శొంఠి ఈరెంటిని చూర్ణించి వాపుపైనను౦చి కొంచెముగా నొక్కిపట్టిన ఆమదోషసంబంధమయిన నీరుపోయి బాధతగ్గును. ఇట్లు రెండుమూడుసార్లుచేయవలెను.

మరియు బాలింతబోలు నల్లమందు సానమీద బాగుగా అర గదీసి సలుపుగల పంటిమీదను చిగురు మీదను రాయవలెను. చిగు రు వాపుండిన యెడ పైభాగమునను రాయవచ్చును.

## 149 పుప్పిపంటికి చికిత్సలు

నిమ్మపంటిరసము తేనె మాదీఫలరసము ఈదిరసులు సమాం శాలు చేర్చి పుప్పిపంటిపై రాచిన దురద వాపు పోటు నశించును. పు రుగులు చచ్చిపడును. మరెన్ని దుష్టుపాకు రసం కుడిపార్శ్వమైతె ఎడ మచెవిలో ఎడమపార్శ్వమైన కుడిచెవిలో పిండేసి. పురుగులు చచ్చి పడును.

## 150 దంతమాదలకు

పండినపొట్లకాయపై చెక్కన్ను మిరియాలున్ను మెత్తగా నూరి ఆపంటిప్రదేశమునుంచి పైన లేతతములపాకువేసి నొక్కిపట్టేది చెడునీరంతయు వోడిపోవును. ఇల్లా రెండుమూడు దినాలు చేయావలెను

## 151 పుప్పి దంతమాదలకు

వెలగబంక తు ౧ మెత్తగానూరి ఆపొడుమున ముద్ద హారతి కర్పూరము వకతులము కలిపి దంతమునకు రాచిన పోటు పుప్పి దంత మాద పోవును.

## 152 దంతములనుండి రక్తము స్రవించుచుండిన

పటికనుపొంగించి ఒక గలాసులో వేసి అందుతగినన్ని మంచి నీళ్ళుపోసి ఆనీటితో రెండుమూడుసారులు పుక్కిలించివేసిన రక్తస్రావ ముకట్టును. మరిన్ని పొగడమాన్రిను చెక్క నములుచుండినను ఆరస మును పుక్కిలించుచుండినను కదలుచుండేదంతాలు గట్టిపడును. వజ్ర తుల్యముగ ప్రకాశించును.

153 దంతములందలి క్రిములకు

నీలి వెలమసంధి చేదుసార వీటివేళ్ళు ప్రత్యేకప్రత్యేకంగా చూర్ణించి దంతములపై నుంచిన పురుగులు నాశనమగును.

154 వాపు కదలుచుండుట పోటు రక్తస్రావములకు

చికిత్స

జీలకర్రి సైంధవలవణము పిప్పలి ఈమూటిని చూర్ణించి దంతములకు రుద్దుచుండవలెను.

155 దంతములు గట్టిపడుటకు

తెల్లనైనట్టి సుగంధిపాల ఆకునూరి ముద్దచేసి పండ్లయందుంచి అదిమిపట్టిన క్రిములు క్రిందవ్రాడి పడును. పండ్లుగట్టిపడును.

156 కదలుచుండుదంతములు గట్టిపడుటకు

కొడిశపాల తక్కలివేరు తెల్లవెంపలి చింతగింజలు వీటిలో ఏది నూరి పండ్లతోముచు వచ్చినను పండ్లు గట్టిపడును.

157 కేశవర్ధని

గుంటకన్నాకురసములో మంచినూనె కలి రసము ఇగురిపోయే టట్లు కాచి తలయంటుకొన్నయెడల వెంట్రుకలు వృద్ధిచెందును.

158 పులిపిరి ఊడిపోవుటకు

రావిచెక్కబూడిద క్రొత్తసున్నము సమభాగాలెత్తుకొని దానికి సమం వెన్నచేర్చి లేపనంచేయవలెను.

159 మేధోవర్ధనిచూర్ణము

,,మేధోవర్ధనీ చూర్ణం మేఘనాధేన కల్పితమ్, మేధోవర్ధని చూర్ణము ఇంద్రజిత్తుచే కనిపెట్టబడినది. దీనిగుణము కళ్ళుమంట

తలనొప్పి నిద్రలేకుండుట నిస్సత్తువ పాలుమాలిక మొదలగు దుర్గుణము లను పోగొట్టి మంచి ఉపకళ శక్తిని కలిగించును.

| | | | |
|---|---|---|---|
| ఉశిరికపప్పు | 4 పలాలు | వాము | 1 పలము |
| తెల్లమిర్యాలు | 1 పలము | పలుకుసాంబ్రాణి | 1 పలం |
| కస్తూరి పసుపు | 1 పలము | | |

ఈదినుసులు ఎండబెట్టి చూర్ణించివస్త్రఘాళితముచేసి జాగ్రత్త పెట్టి వారమున కొకపర్యాయముగాని రెండుసారులుగాని మూడుసా ర్లుగాని చూర్ణమును వెచ్చని ఆవుపాలలో రెండుతులాలు వైచి చ ల్లారనిచ్చి తలకు మాత్రము మర్దనచేసుకొని సీకాయతోగాని పెసర పిండితో గాని రుద్ది వేడినీటితో గాని చన్నీటితోగాని స్నానం చేసేది.

## 160 మొలగజ్జికి చికిత్స.

పచ్చిపొగాకు నలియగొట్టి కట్టిన రెండు మూడు కట్లకుమాను ను. పాటినేలపొగాకు నలిమి తమ్మివేసి కట్టినను మానును పారిజాతపు ఆకునలిపి రాచుకుండిన మొలగజ్జిపోవును

## 161 గజ్జికురుపులకు చికిత్సలు.

1 మణిశిల పంచితములోనూని పట్టించినమానును.

2 చంగల్వకోష్టు, కొడిశపిత్తనాలు, ఆవాలు, పసుపు, కరు ధూపము ఈవస్తువులు చూర్ణించి మజ్జిగలో కలిపి పూసిన గజ్జిపుండ్లు గజ్జి, దురదలు, మానును.

3 గజ్జిపొక్కులపైన జిల్లేడుపాలు పోసిచేది. చితికినపిమ్మట కవిరెచూర్ణముగాని, ముళ్ళతోటగూర కాల్చినమసినిగాని మరిగించిన నూనెలోవేసి ఆనూనెను ఆరార పట్టించు చుండవలెను. రెండుమూడు పూతలకు వెజ్జుపుండ్లుపడి మానిపోవును.

162 సమస్తచర్మరోగాలకు.

మణిశిల, మాంజిష్ట,మాత్రినిపసుపు,పసుపులక్క, నెయ్యి,తేనె, ఈదినుసులను కలియనూరి డబ్బీలోజాగ్రత్తపెట్టి పూయుచుండవలెను. చర్మరోగము లన్నియు నిర్మూలమగును. సబ్బుతోగాని, కుంకుళ్ళనుర గతోగాని కడిగిశుభ్రము చేసుకొను చుండవలెను.

163 చెవిడికి.

హారతికర్పూరము, ఆవునెయ్యి, మంచిగంధము, నల్లమిర్యా లు, బాగానూరి పట్టించేది. చెవిడిమానును.

164 సమస్తమైన విషాలకు కర్కోటకాదికల్పము.

గొడ్డుఆగాకరదుంప తెచ్చియెండబెట్టి చూర్ణించి ఆచూర్ణానికి సమానంగా పంచదార కలిపి తేనెతోనెలదినాలు సేవింపవలెను. తేలు యెలుక, పిల్లి, వెర్రికుక్క, వీటివిషాలుహరించును. మరియుక్షయరోగ ములు మున్నగు సమస్తరోగములు మానును. శరీరమునకు మిక్కిలి కాంతినిచ్చును.

165 మకోకవిధము.

ఆగాకరాకురసంలో గిద్దెడుమంచినూనెపోసి పొయిమీదపెట్టి సన్నమంట చేయుచుండిన పాకమునకువచ్చును. దానినిగచ్చకాయప్ర మాణంగామాత్రిలుచేసి నీడనెండించి సీసాలోభద్రపరచియుంచుకొనే ది. తరవాణితోగాని, పులిమజ్జిగతోగాని మాత్రిసేవించేది. చప్పిడి పత్యము.

166 పాముకాటునకు చికిత్స.

తెల్లయీశ్వరి వేరు అరగదీసి గాయానికి పట్టించిన గాయం మానును. ఆగంధమును కుంకుమగింజ ప్రిమాణంలోనికిచ్చిన విషము నిర్విషమగును. పరుహాంస క్రియ:—నాగముషిణి నూరి త్రాగిం చేది.

### 167 సర్వవిషహరము.

పేరంటాలు విత్తనాలు బేడెత్తు నీళ్ళలోనూరి సర్పదష్టుల కిచ్చిన ఏపాము విషమైన హరించును.

### 168 సర్వవిష నివారణము.

సర్పాక్షిమూలను దంచి నీళ్లలోవైచి కషాయంబెట్టి త్రాగించినను, సర్పాక్షిని మనుష్య మూత్రాన నూరి త్రాగించినను సమస్త విష నివారణము.

### 169 సర్పదష్టుఁ డని యెఱుఁ గుటకు.

స్వరహీనముగ నున్నను, వేపాకు తినిన తీయగా నుండినను, ఉప్పు తియ్యగాను, చప్పగానుండినను, శూల, అతిసారము, భ్రాంతి, మూర్ఛ, వణుకు, గలిగియున్నను సర్పదష్టుడని యెరుగ వలెను.

### 170 సర్పదష్టమునకు దుష్టనక్షత్రాలు.

భరణి, కృత్తిక, మూల, ఆశ్లేష, విశాఖ, మఖ, ఆరుద్ర ఈనక్షత్రముల సర్పదష్టమైనవాడు జీవింపడు.

### 171 వెర్రికుక్క, నక్క కరచిన-చికిత్స.

గచ్చపప్పు బాగానూరి కలిలోకలిపి త్రాగించేది. మూడుదినాలు చప్పిడిపత్యం. ఆరు నెలలు చేయించేది. ఆవాలు, మామిడి కాయ, స్త్రీ సంగమం వర్జింపవలెను.

### 172 తేలుకాటునకు-చికిత్స.

పేరంటాలు విత్తములు రెండు గులిగింజల యెత్తు తాంబూలంతో నమిలి తిన్నయెడల తేలువిషం విరగ్గై పోవును.

### 173 వృశ్చిక దష్టమునకు-చికిత్సలు.

కలి నీళ్ళలో వెలమసంధి వేరు నూరి త్రాగించేది, దానిగుణము కాటు పైన రాసేది.

మాత్రిని పసపు, పిప్పలి, మిర్యాలు, వేపాకు, వాయువిడంగాలు, భద్రిముస్తలు, చిత్రిమూలం, జీలకర్ర, శొంఠి, చంగల్వకోష్టు, సైంధవలవణము, కరక్కాయ, అతి వస, చిరుబొద్ధి,

ఈ దినుసులు సమభాగములు కల్వములోవేసి మేక పంచితాన మాత్రికు వచ్చునట్లు శలగ గింజంతేసి మాత్రిలు చేసి నీడ నెండించి జాగ్రిత్తబెట్టుకొనేది. 8 (యెనిమిది మాత్రిలు) చల్లతోపుచ్చుకొన్న సర్వవిషము, వృశ్చిక విషం హరించును. ఒక మాత్రి జిల్లేడు పాలతో అరగదీసి కాటుపై వ్రాసిన విష హరము.

### 174 నక్క-వెఱ్ఱికుక్క-కాటునకు.

మంగచక్క బోడసరము, ఈ రెండు దంచి గాని, నూరి గాని, రసము తీసి వడియజేసి, ఆరసములో 3 గాని 4 గాని నూనె చుక్కలు వేసి త్రాగించేది. మండలమురోజులు చేయవలెను. విషహరం. కాకరాకు రసందేహమునకు పూసికొని స్నానం చేసినను విషహరం.

### 175 కుక్క కాటునకు.

నూనె, బెల్లం, జిల్లేడుపాలు, ఈ మూడు కలియనూరి కాటుపై రుద్దవలెను. లేపనముచేయవలెను.

### 176 యెలుక-కాటునకు.

తొమ్మిది మిర్యాలు, వక తులము చాందాత్రిశాకు, కలితో బాగానూరి చింతగింజ ప్రిమాణము మాత్రిలు చేసి మూడురోజులు రేపు మాపు యియ్యవలెను. చప్పిడిపత్యము 10 రోజులు.

### 177 యెలుక కాటునకు మరొక చికిత్స.

కరధూపము, చింతగింజలు ఈ రెంటిని నూరి పాతనేతిలో తులమున్నర కలిపి త్రాగింపహరించును. శొంఠి మంచినీటితోనూరి ముక్కుతో ఆఘ్రాణించిన విషహరము. మెట్టతామరాకు, మిర్యాలు

ఈ రెండు నూరి కాట్లు వేసి కట్టేది. పథ్యము:— చిట్టికూరపులుసు చిట్రివేళ్ళ రసం (చారు) తెల్ల గజ్జేరు కూర, వెలగపండు మొదలయినవి.

ఉమ్మెత్త వేరు, జిల్లేడువేరు నీటితో నూరి తాగినను విషము హరించును. ప్రత్తిఆకు, మూషికవిష్ఠయు (యెలుకమలము) సమభాగములునూరి పూటకు పావుతులం మాత్ర చొ॥ మూడురోజులు పుచ్చుకొన్న హరించును.

178 జెర్రి-విషమునకు.

కుట్టినచోట మండుచుండును. వెదురుదవ్వ అరగదీసిన గంధ శొంఠిగంధం, శ్రీగంధం, రక్తచందనం, వీటిని కలిపి కుట్టినచోటవేసి సయెచ్చగా పిడుక నిప్పతో కాచవలెను.

179 తాటిజెర్రికి-చికిత్స.

తెల్ల జిల్లేడుతెచ్చినీటిలో ఉడుకబెట్టి పై తేట తాగించిన విషహం. కరచినచోట ఆచేదును వ్రాయవలెను.

180 విషహరాంజనము

1భాగం కుంకుడుకాయ మిర్యాలు $1\frac{1}{2}$భాగము మంగవిత్తనాలు (నాట్లు)4 భాగాలు నిమ్మపండ్లరసాన బాగామర్దనాచేసి పిమ్మట కణికలుగాచేసి భద్రపరచుకొనేది. ఏపాము కరచిన వానికైనను ఆకణికను నిమ్మపండు రసాన గాని కలినీటితో గాని సానమీద అరగదీసి కన్నులకు పెట్టేది. విషహరమగును.

181 తామరకు

మోదుగమాడల చూర్ణము నీటితో నూరి నిమ్మపంటి రసాన పట్టించిన పట్టు పోయినట్లు పోవును.

182 కాళ్ళుచేతులు పగిలినందుకు

మైనము మంగకాయ సముద్రపుటుప్పు ఇవినూరి వెన్నలో

కలిపి ఉడికించి 7 దినాలు పూయుచు నచ్చిన మేహ కారకమువల్ల పగిలిన పగుళ్ళు పూడిమృదువుగానుండును.

183 అరికాళ్ళు మంటలు నొప్పులకు

దిరిశనపు చెక్క తెచ్చిరోటదంచి ఆపొడికాళ్ళకు వేసి కట్టేది మానును.

184 కీలుమండి నొప్పులకు వాపులకు

అవిశఆకు తెచ్చి మగపిల్లవాని అల్పాచ మానము పోసివేయించి కట్టేది. వాపుతీయును. రెండుకట్టులుకట్టేది వాపుతీసినపిదప ఆకాలిమీద తనఅల్పాచమానం పోసుకొంటూవుండేది ఆవెనుక ఆకాలివిషందిగి వకచోట బొబ్బగాలేచి చితికిపోవును.

185 స్త్రీజననమా? పురుషజననమా?

ముందుగా కుడిచంటియందు పాలుపడినను కుడికన్ను బరువై పెద్దదిగా నుండినను కుడితొడ మిక్కిలి లావుగా నుండినను మరిన్ని విశేషముగ మామిడి చెట్లుఅశ్వాలు యేనుగులు మొదలగు వాటిపై అపేక్షయుండినను స్వప్నమందు తామరపూలు నల్లకలువలు తెల్లకలువలు అంబాళపు కాయలు మొదలగునవి కనబడుచుండినను ముఖముకాంతి ప్రసన్నత్వముగలిగి యుండినను ఆస్త్రీకి మగశిశువు,జీవించునని తెలిసి కొనవలెను. వేరువిధమైనయెడల——అనగా ముందుగా ఎడమ చంటియందు పాలు పడుట ఎడమ వైపుభారముగ నుండుట మున్నగు విధమున నగుపడిన స్త్రీశిశువును మగువ ప్రసవించునని రూఢిగ చెప్పవలెను. ఒకపాత్రములో తేటజలము పోసి అందు గర్భిణిస్త్రీ యొక్క చనుబాల చుక్కనొకదానిని విడిచినట్లయిన నది వ్యాపించి పైకితేలినట్లయిన మగ శిశువు తప్పక జన్మించుననియు అట్లువ్యాపించి పైకితేలక మునిగినయెడల ఆడ శిశువు జనించుననియు చెప్పవలెను. మరియు గర్భిణి మిక్కిలి సోమరితనము గలదియై యుం

డినను ఎడమవైపు స్తనము పీవరమై యుండినను ప్రసవ సమయమున మర్మస్థానమునకు నాభికిని మధ్య ప్రదేశమున నొప్పులగుపడి కడుపు లోనికి వ్యాపించినను తప్పక ఆడుశిశువు జననమగునని యెరుంగునది.

186 గర్భిణిస్త్రీ వర్జింపవలసినవి

ఎక్కువ వ్యాయామము ఉపవాసము సురతము లంఘనము మొదలగునవి పగటినిద్ర రాత్రిజాగరణము దుఃఖించుట భయపడుట నిమ్నోన్నత ప్రదేశములందు (మెగుడు దిగుడు నేలల) విహరించుట కూర్చుండుట మల మూత్రముల వేగమును ఆపుట మొదలైనవి వర్జింపవలయును.

187 శిశువులకు రక్షాధూపము.

ఆవాలు వేపాకు వెల్లుల్లి చాగవేళ్ళు పాము కుబుసము మేకవెంట్రుకలు మేక కొమ్ము వస వీనిని చూర్ణించి అందుతేనె కలిపి బాలురకు ధూపము వేయుచుండు నెడల ప్రబలజ్వరాలు గ్రహబాధలు పిశాచ బాధలు తొలగును.

188 సూతికారోగనిదానము

ఒడలునొప్పులు, జ్వరము, వణకు, దప్పిగల్గుట, శరీరము బలువుగా నుండుట, వాపు, శూల, విరేచనములగుచుండుట ఈలక్షణాలు బాలింతకలిగియుండినసూతికారోగము ప్రవేశించినట్లెరుంగవలెను.

మరియు శ్లేష్మనాడి మందగతి గల్గియుండును. వాతనాడి మిక్కిలి శీఘ్రగతి గలదిగను, పిత్తనాడి శీఘ్రగమనముతోను ఉండును. పరీక్షించి సూతికాహాతమని తెలిసికొనవలెను. తగు చికిత్స వెంటనే చేయింపవలెను. బాలింతరాలు బాగుగా శరీరారోగ్యము బడయు వరకు ఉపచారములు చేయించుట దుష్టాన్నపానాదుల నొసగుట జీర్ణ

ముకానట్టి పదార్థములిచ్చుట (అనగా భుజింపగూడదు) విషమాసన ము మొదలగు వాటివలనను మిగుల భయంకరమును ప్రకోపద్రవ కారమునునగు నీరోగము జనించును. సూతికారోగంబుకతంబున వాతప్రకోపముగల్గుటయు స్వస్థానమునుండి విడువబడినరక్తము నష్టగించుటయు బాలింత హృదయము, మస్తకము, (తల) పొత్తికడుపు దీని యందు శూలజనించుటయు సంభవించును. ఈశూలను మల్లక్క మందురు ఇంకను జ్వరము, విరేచనములు, వాపు, శూల,కడుపుబ్బరము, శక్తిలేక యుండుట, కఫవాతరోగములవల్ల జనితమైన తంద్రి (సోమరితనము) అన్నహితవు తప్పుట, నోటనీరూరుట మొదలగువికారములు కల్గియుండిన కఫవాతములవలన జనించినట్టి సూతికారోగమని గుర్తెరుంగవలెను.

మాంసము, బలము, అగ్ని, క్షీణించియుండి నట్లాయెనా కష్ట సాధ్యమనియు, తెలిసికొనవలెను. ఈచెప్పిన వన్నియు సూతికారోగ లక్షణములనియు, ఉపద్రకరములనియు, తెలిసికొనివెంటనే తగు చికిత్సచేయించవలెను. వెండియుఁ పైకీకనజడకుండా కొందరి శరీర ప్రకృతి, తత్వములననుసరించి ప్రసవించిన ఆరుమాసములవరకును, ఈరోగ మాశ్రయించియుండునని తెలియనగును. ప్రసవానంతరము చలిది, పులిది, తినుటకు త్రాగుట, మొదలగు అపథ్యదోషములవల్లను, కొన్ని యితరకారణములవల్లను బాలెంతరాండ్రకు జ్వరము, తలనొప్పి మొలనొప్పి వెన్నులోపోటు, గోళ్లు నల్లబడుట కంఠముమంట, మసకలు, కంఠప్రదేశమున, ఆయువుపట్టున చెమటపట్టుట, మొదలగునవి కనిపించును, దానిని బట్టికూడా సూతికారోగమని తెలిసేది.

189 సూతిక కడుపునొప్పికి చికిత్స

పగడభస్మము, సాంబ్రాణిపువ్వు, యాలకులు, ఇవి సమభాగములు మర్దించి వెన్నతో యిచ్చేది.



### 190 సూతికరోగి తలకుపట్టి

వసనాభికొమ్ము జిల్లేడాకుల రసానగాని, జిల్లేడుపాలనుగాని, ఒగతీసి ఆగంధమును గుడ్డకుగాని, కాగితమునకుగాని పట్టించిరోగి యొక్కమాడున వెంట్రుకలు కత్తిరించి కత్తితోగీచిపట్టివేసిన సూతి సంబంధవిషహారమగును.

### 191 నెలలునిండి ప్రసవింపలేకున్న చికిత్స

నెల్లికూర తినిపించవలయును. సుఖప్రసవమగును.

### 192 సుఖప్రసవమునకు

వస, పిప్పళ్ళు నీటితో అరగదీసి, ఆముదముకలిపి, బొడ్డుమీద లేపనము చేసిన శ్రమపడుచున్న స్త్రీ సుఖప్రసవమగును.

### 193 మరియొక విధము

మాదీఫలమువేరు, అతిమధురము, వీటిచూర్ణం, నేతిలోవేసి కలిపి త్రాగించిన సుఖప్రసవము కనును.

### 194 శీఘ్రప్రసవానికి

మర్రివేళ్ళరసాన, గుమ్మడాకు, పత్తిగింజలు, మెత్తగా నూరి అరికాళ్ళకుపామేది. శీఘ్రప్రసవమగును.

తెల్లగజ్జెరువేరు అమరశిలగంధకం, నూరి బొడ్డుపైనుంచిన సుఖప్రసవము శీఘ్రముగ ప్రసవించును.

### 195 సూతికాభరణము

వసనాభి, మణిశిల, తాళకము, పాదరసము, గంధకము, గరళము, లోహం, తామ్రభస్మం, తగరపుభస్మం, అభ్రకభస్మము, సీసంభస్మం, బంగారుభస్మం, కాంతభస్మము, వెండిభస్మము, సత్తుభ

భస్మము, శంఖభస్మము, వెలిగారం, ఇంగిలీకము నేపాళాలు, శొంఠి పిప్పలి మిర్యాలు, నీలిమందు, మైలతుత్తము, యవాక్షారము, జాజి కాయలు, మరిన్ని చేపచేదుకట్టు, తాబేటిచేదుకట్టు, మొసలి చేదుకట్టు నెమలిచేదుకట్టు మనుష్యునిచేదుకట్టు మేకచేదు పెద్దపులిచేదుక ట్టు దున్నపోతుచేదుకట్టు చెవులపిల్లిచేదు ఈదినుసు లన్నిటినికల్వంలో వేసి నెమలిచెక్కరసముతోడ చిత్రమూలపు రసము అల్లపురసము ని మ్మపండ్లరసము తులసిరసములతోడను బాగా మర్దించి అనగా ఈచె ప్పిన ఒక్కొక్కరసమున నొక్కొక దినము చొప్పున మర్దనచేసి పిమ్మ ట మినుపగింజప్రమాణంగా మాత్రకట్టి పుచ్చుకొనవలయును. ఈయౌషధము సూతికావాయువుల మీదనుశుష్కవాదములపైనను, సమస్తాంగవాతములమీద, పక్షవాతములపైననునడుపవలెను. ఈచెప్పి న రోగములు మటుమాయమగును. మినపగింజంతమాత్ర పుచ్చుకొ నవలయును.

## 196 స్తన్యవృద్ధికి

నేలగుమ్మడిగడ్డ పాలలోనూరిరసను పిండుకొని, అందు పంచ దారచేర్చి త్రాగినకావలసినన్నిపాలుపడును. పిల్లిపీచర [శతావరి] పా లలో నూరి త్రాగును పాలుపట్టును. పిప్పలి చూర్ణించి ఆచూర్ణము కొద్దిపాటినేతిగల పాలలో కలుపుకొని త్రాగుచుండిన స్తన్యమువృద్ధి చెందును.

## 197 కుసుమరోగము.

దీనిని:“అస్రుగ్దర” అనియందురు, ఉపవాసములుచేయుటవల్ల, దాహ మును పుట్టించునట్టిపదార్థములసేవించుటవల్లను, అతిసంగమమువల్లను రక్తముచెడిపోయి, దుర్గంధముతో యోనినుండి స్రావము వెడలుచుం డును. వెంటనేచికిత్స చేయించుకొనవలెను. తామసింపకూడదు.

## 198 కుసుమరోగలక్షణములు.

పైత్యాధిక్యమువలన, నురగతోగూడరక్తముమోదుగుపువ్వు వలె, ఎఱ్ఱనివర్ణముగల రక్తముస్రవించునురక్తముయెఱ్ఱగాగాని, నలుపుతోగూడిగాని, వెచ్చగాగాని పాండురవర్ణముగాగాని, యుండును. మరియు ముక్కలుముక్కలుగజిగటగనుఅధికముగను వెడలుచుండును

## 199 కుసుమరోగచికిత్సలు.

సోపు, శొంఠి, తెల్లగుగ్గిలము, గంటిభారంగి, మాచెకుపండు గుంజు, చీనాపంచదార ఈదినుసులు చక్కగానూరి వారమురోజులు సేవించిన కుసుమలుమానును.

శుద్ధిచేసిన శిలాజిత్తుమాడయెత్తు, పంచదార, ఈరెండుబియ్యపుకడుగుననూరి త్రాగించిన కుసుమరోగము హరించును.

జేగురురాయి, రససింధూరము తెల్లనిగుర్జమసి సమభాగాలు మెత్తగానూరి వెన్నలో కలుపుకొనిపుచ్చుకొనిన కుసుమరోగముహరించును.

## 200 కుసుమ, సుర్దకట్టు, కాళీరోగములకు చికిత్స.

తుత్తిరిబెండ ఆకునూరినముద్ద మూడుగచ్చకాయలంత, టంకమెత్తు పటికపంచదార, యాలకాయలలో నుండినలిచిన గింజలు చూర్ణము, ఈమూడున్ను మూడుదినాలు, ప్రొద్దుటి పూటపెరుగులోకలిపిసేవింపవలెను. శగరోగములు సహాహరించి యారోగ్యముగలుగును.

## 201 తెలుపు, చురుకు, మేహరోగాలకుచికిత్స.

చిట్టిఆముదం, ౧ శేరు, తెల్లపుల్లిగడ్డలరసం అర్ధశేరుఆవుపాలు అర్ధశేరు,యిసందారిఆకుపసరు,కలబందగోపలిపలుకులున్ను, తెల్లవుప్పి,

తెల్లగలిజేరుచెక్క అటుకుమామిడిచెక్క ఈదినుసులుయావత్తుసన్నముగా తరిగిబానలోవేసి,నీళ్లుపోసిబాగుగాకాగనిచ్చి తైలముతీసికొనిఅందులో పాలుపోసి ఆముదముపోసి కలబంద రసముపోసి యర్రిగడ్డలసారము పోసి తోకమిర్యాలు డబ్బెత్తు పెద్దపిప్పళ్ళు కోష్టం డబ్బెత్తు అక్కల కర్ర డబ్బెత్తు అతిమధురం అరతులము యీవస్తువులు వేయించి పొడిచేసి ఉంచి ఆముదము పదునుగావండి దింపినవెనుక యీపొడి పోసి కలిపేది. పదిదినాలు ఊరనిచ్చి గంటెడు చొప్పున సేవించేది. ఇచ్ఛాపత్యము.

## 202 సుద్దకట్టుకు చికిత్స

తెల్లగలిజేరువేళ్ళతో ఉప్పువేసినూరి కుంకుడు గింజప్రమాణము మాత్రచేసి యియ్యవలెను. పథ్యములేదు.

## 203 స్త్రీలబట్టంటు గుణానికి

చూర్ణించిన తెల్లగుగ్గిలము 1 తులము తెచ్చియేడుసారులు మంచినీటిలో పొంగబెట్టి పిమ్మటదించి యెండించి ఆచూర్ణమునకు రెట్టింపుగ పటికబెల్లము పొడికలిపి ప్రొద్దునసాయంకాలములయందు రెండుపూటలా నాల్గురోజులు పుచ్చుకొన వలెను పత్యంలేదు.

## 204 సుద్దకట్టుకు

తెల్లపత్తివేళ్ళరసము డబ్బెత్తు పైడిపత్తివేళ్ళరసము వకడబ్బెత్తు మంచినూనె డబ్బెత్తు ఈమూడింటితో జీలకర్ర తులము కలిపి అయిదురోజులు సేవించేది. గేదెపెరుగు అత్తెసరు అన్నము.

## 205 చీరవ్యాధికి చికిత్స.

జీడిగింజలు శేరు వాముపొట్టు శేరు చక్కెర శేరు పాతకొబ్బరి శేరు ఈదినుసులునూరి నేతితో సేవించిన కాంతల చీరవ్యాధులు నశించును.

## 206 బట్టంటుగుణాలకు అనుభవం.

కర్పూర శిలాజిత్తు భస్మము గరికమోడిచెక్క మిర్యాలు కషాయముపెట్టి ఆకషాయములో పై చెప్పిన శిలాజితు భస్మం వేసి యిచ్చిన చురుకు నిలుచును ఆవెనుక———

| | |
|---|---|
| మాచికాయలు | అరపలము |
| జాజికాయ | ,, |
| లవంగపట్ట | ,, |
| ఫిరంగిచెక్క | ,, |
| గసగసాలు | ,, |
| రేవల్ చిన్ని | ౨పలాలు |
| నేలతంగేడు | ౧౦పలాలు |

ఈదినుసులు వస్త్రఘాళితంచేసి నెయ్యి చక్కెర ౮ పలాలు కూడావేసి లేహపాకం బట్టి ఆపాకములో పై చెప్పినవస్తువుల చూర్ణము పోసి దించుకొని జాగ్రత్తపెట్టుకొనేది. పూటకు పావుపలము వంతున పుచ్చుకొనేది, ఇచ్ఛాపత్యము. నోటరక్తము పడుచుండుటయునిలుచును. దేహముమీద కాసులు కాసులుగా నుంటె తేనిచేర్చి లేహం చేసేది. మందు పుచ్చుకొంటుండగానె మిర్యాలు కషాయం పుచ్చుకొనేది.

## 207 అంటుగుణాలకు చికిత్స.

గంగరావిచెక్క పచ్చిదితెచ్చి నలియగొట్టి మజ్జిగలో నానవేసేది. చౌడు వేరేనీళ్ళలో నానవేసి తేరనిచ్చి వేరే వేరే రెండుపలాలు ఆకుచుట్టలు చుట్టి నోట్లోపెట్టి రెండుచుట్టలలోను రెండునీళ్ళు వేరే వేరే పోసి గుక్కున మింగేది. ఆనీళ్లు నాభియందుచేరి పేగును

సూచమటపెట్టి ఆయాసముగా ఉండును. పొల్లుమూను పూటలు యి చ్చేది. ఇచ్చాపత్యం అంటుగుణాలు పోవును.

208 అంటుగుణాలకు అనుభవము.

జీలకఱ్ఱ మునగఆకు బాగానూరి అరుప్రుండలుచేసి మూడుదినా లు యిచ్చేది చప్పిడి పత్యము.

209 అస్థిస్రావనిదానము.

యోనియందు రక్తముతెల్లగగాని, కొంచెముపలుపువర్ణముగ గానితేటగగాని ఉండినదై దుర్గంధముగలిగి వెడలుచుండును. అనగాఅస్థు లలోనుండేమజ్జను (అనగాయెముకలయందలిసారము.) ఆకర్షించును. పేగులయందు శోష (మూర్ఛలేకసొమ్మసిల్లుట) శూలఇవిబైలుదేరు ను.

210 అస్థిస్రావమునకు చికిత్స.

అరుదొండవేరుతెచ్చి అరగదీసి ఆగంధములో కొతిమెర్లు, పి ప్పలి ఈదినుసులచూర్ణంగాని, లేకయోగరాజుగుగ్గులునుగాని, చేర్చి పుచ్చుకొనిన అస్థిస్రావముహరించును.

211 తెల్లచీరె, ప్రదరరోగములకుచికిత్స.

ముత్తవపులగము, అమృతవల్లి (తిప్పతీగ)ఉశిరికపలుపు తెల్లతుమ్మయిగుళ్ళు, ఈదినుసులుకషాయముగబెట్టి సేవించిన ప్రదర ము. రక్తపిత్తము, తెల్లచీరెరోగము, వీటినిపోగొట్టును.

212 యోనిశూలకుచికిత్స.

మొగులుకడివేరుపట్ట, (అనగానీరుకడిమిచెట్టు) చంద్రగుండగల గర, వీటికషాయము ఒకమాసముసేవించిన యోనిశూలహరించును.

213 యోనిశూలకులేపనము.

వెఱ్ఱిపుచ్చవేళ్లు మేకనేతిలో ఉడికించియోనిమీద లేపనముచేసిన యోనిశూలనుహరించును.

214 గర్భపాతమునకు చికిత్సలు.

నిదానము:— గర్భస్రావకాలమునందు దాహము, పక్కల యందు, వెనుకభాగమున శూలవచ్చును. ప్రదరము, (రక్తస్రావము) మూత్రముబంధించుట మొదలగును ద్రవములు జనించును.

చికిత్స:— వట్టివేరు, అతివస, తుంగముస్తలు,బూరుగుబంక, కొడిశపాలగింజలు, వీటినికషాయంబెట్టి త్రాగనిచ్చిన ప్రదరము, గర్భముయొక్కచలనము, (కదలుట) శూలఇవి హరించును.

మఱిన్ని-

చక్కెర, నూవులు, తామరతూడులు, ఇవిసమభాగాలునూరి తేనెఅనుపానములోసేవించినను హరించును.

215 గుర్రానిక్కకడుపునొప్పికి.

ఆముదమువేరున్ను, నల్లేరు, కర్పకాయలు, యింగువ, కూడ కల్పి త్రాగించేది.

216 శుక్లనష్టము— హేతువు.

మనశరీములకు శుక్లశోణితములెఆధారము. శగసవాయిమొదలయిన సంకటాలవల్లరక్తంచెడును. మేహవాతాలు, శిరోవేదనలు, అజీర్తులు, కడుపుబ్బడాలు సంభవించును.

మరియువీర్యమును స్థంభింపజేసియెక్కువకాలము సురతముచేయవలెనను కోరికవల్ల నల్లమందు, గంజాయి, మున్నగునవి కలిపిన మాత్రలు, లేహ్యములుపానీయములుసేవించుటవల్లను, చాలాకాలము స్త్రీసంగమంమాని యుండుటవల్లనుశుక్లనష్టముసంభవించును. మరిన్ని

వీర్యముస్రవించుట, నల్లగుండె, హృదయస్థానముదుర్బలమగుటచేత మొద ను జబ్బుకలుగుట వాటివల్లను కలుగును.

### 217 శుక్లనష్టమునకు పాయసము.

నేతితో దోరగామినపపప్పు వేయించి రవచేసిఆవుపాలలో వేసి చక్కెరచేర్చి పాయసంచేసుకొని సేవించినశుక్లనష్టము నివారించును.

### 218 ఇంద్రియపుష్టికి పకల్ జాక్.

తెల్లనినీరుల్లిపాయలను దంచి రసముతీసి, ఆరసానికి రెండింతలు మంచితేనెకలిపి, పొయిమెక్కించి, క్రిందసన్నమంటపెట్టి పాకంబట్టేది చల్లారినతోడనె భద్రపరుచుకొనేది. పండుకోబోయేటప్పుడు పూటకువ కతులం చొ॥ పుచ్చుకొనేది.

### 219 ఇంద్రియస్ఖలనము.

అధికమోహం, పగలురాత్రి అనక పెక్కుసారులు సంభోగించు ట, రతివర్జించియుండుట, మొదలైన కారణాలవల్ల బలక్షీణముకలిగి సంభోగవాంఛే లేకపోవును. బలమునకు ప్రధానము ఇంద్రియముగను క ఇంద్రియమునుకాపాడుకొనుట ప్రథమధర్మము. నూరురక్తపుచుక్క లుఒకఇంద్రియపు బిందువు, అట్టిబిందువులెంత ఖర్చుపడిన అంతగా మెదడుశక్తి తగ్గును తలనాడులంకించుకొనును. జ్ఞాపకశక్తి మంటగలియు ను. ఇంద్రియంమూత్రంతో కలిసిపోవును. అనేకరోగాలకు ఆలవాలమై యుండును. ఇవిఆరంభంలో రాత్రినిద్రాస్ఖలనం (స్వప్నస్ఖలనలం) గా ప్రవేశించిపై చెప్పిన గుణాలన్ని క్రమముగాసంభవించును.

### 220 మేహానికి వీర్యవృద్ధికి

చిట్టాముదము అరవీశ, బాడిశపాకురసం, పాతికవీశ ఇవిరెండు కలిపి కాచేది. కాగుచుండగా కలకండ అయిదుపలాలు మూటగట్టి అందులోవేసేది. అందు టెంకాయపాలు అరవీశపోసి కాచేది. పసరు యిగిరి కలకండ కరిగిన తరువాతను దించుకొనేది. పిడతలోపోసికొని

నిత్యమున్ను అరపలముచొప్పున ౧౦ దినాలు పుచ్చుకొనేది. ఇచ్ఛాపత్యము. పులుసు, మజ్జిగ వర్జించవలెను.

221 సకలరోగములకు ఏకమూలికాయోగము

నేలతంగేడు, సమూలము అమృతసిద్ధియోగాన తెచ్చి ఛాయా శుష్కముచేసి మృదువుగాచూర్ణించి ఆయారోగాలవారు భక్షించేది. ప్రాతఃకాలమందు పుచ్చుకొనేది. తేనెతో పుచ్చుకొన్న దేహపుష్టి పంచదారతో తిన్న పైత్యాలుపోవును. ఇట్లు అనుపానాదులతో సేవింపవలెను.

222 మధుమేహానికి ఇచ్ఛాపత్యం

మెంతులు ప్రతిదినమున్ను రెండుపలాలు చొప్పున రాత్రినీటిలో నానవేసి ఉదయాన నూరి నేతితో వడలుచేసి కొని తేనెతో 20 రోజులు ప్రాద్దునసాయంత్రం ఒక్కొక్కటి చొ॥ పుచ్చుకొనేది.

223 శుక్లమేహమునకు

చిత్రమూలము ఆవుపాలతో నూరి సేవింపను మానును.

224 మధుమేహ చికిత్స

బ్రహ్మదొండికాయలు చాలెడు తెచ్చివక సేరుపాలుపోసి రుబ్బి మూడు సేర్ల రసముతీసికొని ఆరసమును పొయిమీదబెట్టి కాగుచుండగా సేరున్నర చక్కెరపోసి పోరటి దినం ౧ కి రెండుతులాలు చొప్పున ముప్పది (30) దినాలు తినేది. ఇచ్ఛాపత్యము.

225 శుక్లమేహమునకు

సాలామిశ్రి, జాజిజాయ, వాలింతబోలు, బూరుగుజిగురు రససింధూరం, సమభాగాలు, ఆవుపాలతో నూరి సెనగగింజంత మాత్రలు కట్టి పూటకు రెండుమాత్రలు చొ॥ పుచ్చుకొనవలెను. గుమ్మపాలతో పుచ్చుకొనవలెను.

226 శుక్లమేహకుశారము.

అరసోలెము ఆవుపెరుగులో అరసోలెము మోదుగచక్క దంచి నరసము కలిపిత్రాగిన శుక్లమేహమ్ము హరించును. పత్యం లేదు. వేడి పదార్థములు తినగూడదు.

227 శుక్రవృద్ధికి-చికిత్స.

ఉసిరికవలుపును చూర్ణించి 21 సారి చెఱకురసాన భావనచేసి నీడనెండబెట్టి, ఆచూర్ణమునకు సమంగా తేనె, పంచదార చేర్చి పుచ్చుకొనేది. వెంటనే ఆవుపాలు త్రాగవలెను. 80 దినములు చేసిన సంతాన ప్రాప్తియుకలుగును.

228 ధాతువృద్ధి-కిజకోటా.

పెద్ద పల్లేరుకాయలు, చల్లపిల్లి గడ్డలు, దూలగొండి విత్తులు, నీరుగొబ్బివిత్తులు, చిట్టాముట్టవేళ్లు, పేరాముట్టవేళ్లు వీనిని సమాంశాలు చూర్ణించి ఆవుపాలలో కలిపి రాత్రిలు పుచ్చుకొన్న అపరిమిత వీర్య వృద్ధికలుగును.

229 వీర్య-వృద్ధికి.

రెడ్డివారినానబాలు చెట్టు సమూలం నీడనెండించి చూర్ణించి 40 దినములు ఆవు వెన్నతో పూటకు యెనిమిదణాలయెత్తు సేవించేది.

230 స్వప్నస్ఖలనము-శుక్లమేహములకు.

పెన్నేరు, నేలగుమ్మడి, నేలతాడి, పల్లేరువేళ్ళు, పిల్లిపీచర, పెద్ద దూలగొండి వేళ్ళు, మినుములు, ఉశిరికవలుపు, బూరుగు జిగురు వీనిని సమభాగాలు చూర్ణించి, ఆవుపాలు వెచ్చబెట్టి అందువకతులం చూర్ణం చేసి పుచ్చుకొనేది. 20 దినాలు చేసేది. మూత్రముతో

కలిసిపోవుచుండు వీర్య నష్టము కట్టును. వీర్యము గట్టిపడును. దౌర్బ ల్యముపోవును.

## 231 తలపోటుకు-పంచాంగచూర్ణము.

ఇరువది మేహములను నిర్మూలించును. తంగేడు చెట్టుయొక్క వేరు, పట్ట, ఆకు, పూవు, పిందె, ఈ అయిదుభాగములు సమంగా చూచుకొని, దీనికి సమం (నేలఉసిరికచూర్ణం) నేలఉసిరికలోసగం నూని పసపు చూర్ణం, అన్నికలిపి తేనెతో గాని, తరిపి మజ్జిగలో గాని 40 దినాలు ప్రొద్దుటపూట పుచ్చుకొనవలెను. ఇచ్ఛాపత్యం. నూనె, ఆవ, గుమ్మడి వర్జము:—

## 232 ధాతుపుష్టికి వేహ్యం

సాలామిశ్రి, వపేదుమిశ్రి, మదన్‌మస్తు, బిజమూ యాలకులు. లవంగాలు, జాపత్రి, జాజికాయలు, మంచిగంధము, కృష్ణాగరు, తవాక్షీర, ధనియాలు, జీలకర్ర, నల్లజీలకర్ర, ఆసపత్రి, గులాబీ పువ్వు, బాదం, మురకాయి, కర్జూరం, పిస్తా దూలగొండి గింజలు, మ జ్రిగింజలు, జువ్విగింజలు, బేదానం, బసనా,కురువేశ్ము, వట్టివేళ్లుతుంగ ముస్తలు జటామాంసి, కురాసానివాము, కురంజివాము, కుంకుమపు వ్వు,యిప్పిమధుకము, విరజాజి, సురత్నపువ్వు,నెయ్యి, తెల్లచక్కెర,ఆవు పాలు, తేనె, ద్రాక్షపళ్లు—తులప్రమాణముకు చక్కెర రెండుశేర్లు పాలు నాలుగుశేర్లు తేనె అర్ధశేరు. లేహంచేసేది. పూటకు అరతులం చొప్పున పుచ్చుకొనేది. ఆవుపాలు త్రాగేది. ఇంద్రియము పలిపో యినది గట్టిపడును. ధాతు పుష్టి కల్గును. తెలుపు ప్రమేహం మొద లగునవి కుదురును.

పత్యం—చాప నూనె, గుమ్మడి, పులుసు, తోటకూర, బచ్చ లి, ఆవ, గోంగూర మున్నగునవి వర్జము. ఇగురుకూరలు తినవచ్చును,

## 233 తిమ్మిరు వాయువులకు.

వెల్లుల్లిపాయ వకటి మూడుమిర్యాలు వేపచిగుళ్ళు దమ్మిడి యెత్తు చొ॥ ఒల్లేడాకు ఈమూడు అమందస్త్రాలో నూరి కుంకుడుగిం జంత మాత్రిలుచేసి తిమ్మిరి వాయువులకు ఇచ్చేద.

## 234 వాతపునొప్పులకు చికిత్స.

తెల్లవుప్పిచెక్క పిడికెడు నాపవేసి కడిగి కాటుకవలె నూరి వక వరహా యెత్తు రసకర్పూరము కలిపి నూరి కుంకుడు గింజప్రిమాణము మాత్రిలుకట్టి రెండుపూటలు సేవించిన వాయువు నొప్పులు హరించు ఇచ్ఛాపత్యము.

## 235 వాయువులకు చికిత్స.

ఇంగిలీకము రసకర్పూరము నేపాళాలు యిసందోఆకు ఇవి సమ భాగాలు నీళ్లుపోయకుండా బాగానూరి బిళ్లచేసి వకజాము సూర్య పుటముబెట్టి ఆవెనుక కర్పాట్ట పెంకుమీద దీపాగ్నితో లేతగాకాచి రసము ఆరేపర్యంతము ఉంచితీసికొనేది. కందిగింజప్రిమాణం తీసికొని బెల్లములో పొదిగి ఆరుదినాలు సేవించేది. ఇచ్ఛాపత్యం

## 236 మరొకవిధము

రసకర్పూరము రససింధూరము ఇంగిలీకము నేపాలము యిసం దోరిఆకు సమభాగాలు కల్వములో వేసిమర్దించి బిళ్లచేసి వకజాము సూర్యపుటాన నుంచి తీసికొని పెంకు మీదా క్రిందా బాగావెచ్చ చేసి ఆరినతరువాత యెత్తి మెత్తగానూరి కరాటానవుంచుకొని మాత్రి లు చేయుటకు బిడ్డనీరుడితో నూరేది. గురిగింజ ప్రిమాణము మాత్రి లు తాటిబెల్లములో పొదిగి యిచ్చేది. యిచ్ఛాపత్యము.

### 237 పేగువాతమునకు చికిత్స

యాలకులు తులము పిప్పళ్ళు నాల్గుతులాలు శొంఠి అయిదు తులాలు కలకండ నాల్గుతులాలు చక్కెర నాల్గుతులాలు చూర్ణించి ఉంచుకొనేది. వాయువుగా ఉన్నట్లయితే తేనెతో యిచ్చేది. ఉడుకు నీళ్లుఅనుపానము. వాయువులు హరింపును.

### 238 చచ్చువాయువుకు

నాలుగు జాతుల | వాముగింజలు జీడిగింజలు తు 2లు లవంగా లుతు 3 లు నల్లమిర్యాలు తు 3 లు పిప్పళ్ళు తు 3 లు ఈదినుసులు బాగుగా చూర్ణించి కల్వముకోనైచి ఆవునేతితో బాగుగా మర్దన చేసి కుంకుడు గింజంత మాత్రలు కట్టి పూటకొకటి చొప్పున ఇయ్యవలెను. మానును. పథ్యము——పావురంమాంసము మిర్యాలచారు గోధుమరొట్టె మొదలగునవి.

### 239 పార్శ్వపునొప్పికి చికిత్స

ఒకతులము మంచినూనెలో చెముడుకాడల రసమొక పావు తులమువేసి రసంఇగురా కాచి నొప్పివున్న పార్శ్వపు చెవిలోపిండేది.

### 240 మూత్రముజారీ అగుటకు

ఆముదాలు, ఇంగువ, మానిపసుపు, కరకపప్పు, ఉశిరెపప్పు, నేపాళపుగింజలు, ఈదినుసులుసమాంశాలు,తీసుకొని చూర్ణించి నిమ్మపండ్లరసముతో 4 జాములు మర్దనాచేసి అల్లపురసముతో పూట 1 కి వక చిన్నమెత్తుచొప్పున సేవించిన జారీఅగును.

పొంగించినవెలిగారం పాతికతులము సూరేకారము అర్ధపావలామెత్తు, వీటితో తంగేడువిత్తులు చూర్ణించి ఆవుమలముకలిపి ఆవు పాలు బాగాకాచి అందులోచేసి పుచ్చుకొనవలెను.

241 నీరుమురాకుండుటకు

తెల్లగరికె గుంటకన్నాకు ఉల్లి వకపడి తాటికలకండ అయిదు పలాలు జాజిజాయ జాపత్రి రెండుతులాలు తోకమిరియాలు వక తులము ఈదినుసులు ముల కరసాన కలిపి సూర్యపుటము కొత్తకుండలో 7 రోజులుంచేది. వేయించిన ఉప్పువాడుకోవచ్చును. చింతపండు వర్జము.

242 నీరుడిబందుకు

పావుతులము రేవల్చిన్ని పట్టతెచ్చి పావుశేరు అవుపాలలో కలిపి ఆరువూటలు యియ్యవలెను. ఇచ్ఛాపత్యము

243 మూత్రిము బంధించిన

తోకమిర్యాలచూర్ణము అరతులము తవ్వెడునీటిలోవేసి కలిపి రెండుమూడుసారులు తాగిన మూత్రిము జారీఅగును. మూడురోజులు చేయవలెను. పత్యములేదు.

244 అతిమూత్రమునకు చికిత్స

ఉశిరికపప్పు కషాయముతో వేపచెట్టు జిగురునూరి కర్పూరశిలాజత్తుభస్మము పదిచిన్నాలెత్తుకలిపి 40 దినములు సేవించేది. మేహములు హరించును.

245 శూలపుండ్లకు

రసకర్పూరముమూడు దుగ్గలెత్తు తులసి తాటిబెల్లంవాము ఇవి చక్కగా నూరి కందిగింజంతమాత్రిలుచేసి ఏడుదినాలు ఇచ్చేది. ఇచ్ఛాపత్యము.

246 మూర్ఛలకు చికిత్సలు

వాతాదిదోషములవలన మెదడున సంభవించును. ఈవ్యాధి వచ్చునవెంటనే రోగి స్మారికముతప్పి పడిపోవును. వ్యాధులనేక విధా

లు కనుక కొందింక మూతి, చేతులు, కాళ్లు, వేళ్ళు వంకరలుపోవు ను. నోటినుండి నురగవెడలును, దేహమాంద్యము, వడలువిరుపులు, అలసటయుండును.

గింజలు పుల్లుతీసివేసిన చింతపండు మెత్తగాదంచి మూసకట్టి అందులో మైలతుత్తముంచి, మూసమూసివేసి మీదబట్టచుట్టి చీరమన్నిచ్చి, ఆరినవెనుక పుటమిడిన చిందూరమువలె చిందూరించును. ఆచింధూరము వక చిన్నమెత్తు రేగుచిట్టము వక చిన్నమెత్తు ములగ ఆకుపసరులో కలిపి మూర్ఛవచ్చినప్పుడు వారిముక్కులలో పోసేది. ఆముదముతో గాని, తేనెతో గాని, యిచ్చేది. ఇది కఫవ్యాధుల మీద సైతం బాగానడుచును.

247 సంగీతము పాటకులకు ఆర్ద్రికాదిచూర్ణము

అల్లము గుంటకన్నాకు గోరింట వస మాండూకబ్రిహ్మి (అస గా సరస్వతిఆకు) భావంచి విత్తనాలు యాలకులు వీనిని సమభాగాలు గ చూర్ణించి ఒక పలముమెత్తు చూర్ణము [మూడుతులాలు] వేడినీటిలో కలిపి 8 వారముల దినములు త్రాగుచుండిన కంఠస్వరము గంధర్వులస్వరముతో తుల్యముగను కోకిల స్వరతుల్యముగను ఉండును.

248 కిన్నర గంధర్వులవలె పాడుటకు

సైంధవలవణము కొడిశపాల మిరియాలు ఈమూడుదినుసుల చూర్ణము వేడినీటిలో నాలుగుమాడలుమెత్తు వేసి రాత్రిలందు సేవించిన స్వరభంగముహరించి ''స్వరాః కిన్నరముచ్యతే"స్వరముకిన్నరమువలె ప్రకాశించును. దీనిని రెండునెలలు సేవించవలెను.

249 సారస్వతచూర్ణము

శ్లో॥ గుహూచ్య పామార్గ విడంగ శంఖినీ
వచాతథా శుంఠి శతావరీ సమం
ఘృతేనలీఢం ప్రకరోతి మానవం
త్రిభిర్దినైః శ్లోకసహస్రధారిణమ్.

తిప్పతీగ, ఉత్తరేణు, వాయువిండగములు, సరస్వతి అకుపసరు శొంఠి పిల్లిపీచర, ఇవియొండించి చూర్ణించి వస్త్రఘాళితమొనర్చి వీస మెత్తు నేతితో కల్పుకొని మూడుదినములు సేవించిన శ్లోక సహస్రమును విన్నమాత్రనె అప్పచెప్పగల ధారణశక్తిగలవాడగును.

250 మూలశంక (అర్శోరోగము.)

ఈవ్యాధిఅతివిచారమువల్ల, అతిగాసంచారము, పగలునిద్రించుట, మున్నగువాటివలన కలుగును. ఈవిషయము మాధవనిదానమున విస్తరించిరా యబడియున్నది. కొందరు మూలవ్యాధి కర్మవ్యాధియని చెప్పదురు. ఈవ్యాధిగలవారికి ఆసనస్థానమునపోటు, చురుకు, మంట, నొప్పి, యుండును. మనశ్శాంతియుండదు. కోపమెక్కువగానుండును. కట్టనిపదార్థములు సేవించినప్పుడు పిలకుబ్బిబిగియుటయు సంభవించును.

రక్తమూలము, ఆర్ద్రమూలము, శుష్కమూలము, ననిమూడువిధములు.

రక్తమూలము:—మలముతోరక్తముపడును.

శుష్కమూలము:— ఆసనద్వారము బిగువుకలిగి . బాధకలిగియుండును. విరేచనము జారీకాకమిక్కిలి ఓర్వలేనంత బాధ శూలకలిగి యుండును.

అతిసంచారము, ఉష్ణపదార్థసేవనము, అతిసంభోగము, నిషాచేయువస్తువుల నుపయోగించుట కట్టిపెట్టవలెను.

### 251 మూలశంకకు చికిత్స.

కరకపెందలు, నువ్వులు, జీడిగింజలు, ఈదినుస్సులు సమభాగాలుతీసికొనిమెత్తగానూరి ఆముద్దకుసమంగాపాతబెల్లమువేసి బాగామర్దించి బదరీఫలమంతేసి మాత్రలుకట్టి యుంచుకొనేది. ప్రాతస్సాయంకాలములను అనుపానవిశేషములతో సేవించుచువచ్చిన మూలశంకనివారణమగును. అనుపానవిశేషములనుటవలన—జ్వరము, మేహసంబంధదగ్గు, ఉబ్బసము, పాండువు, కడుపులోబల్లమున్నగు వాటికిని ఈయౌషధముపయోగింపవచ్చును.

### 252 మూలశంకకు ధూపక్రమము.

జిల్లేడువేళ్ళు, జమ్మిఆకు, తలవెంట్రుకలు, త్రాచుకుబుసము, పిల్లిచర్మము, వీటినిచక్కగా చూర్ణముచేసి నేతితడిచేసి ఆసనమునకు నలువదిదినాలుపొగబట్టిన హరించును.

### 253 మూలశంకకుకట్టు.

గచ్చఆకుచిగుళ్ళు ఆముదమునువెచ్చచేసి రేపటమాపట, ఆసనానికికట్టుచుండవలెను. పసుపునీటితో ఆసనమును ప్రక్షాళనముచేయుచుండవలెను.

### 254 పిత్తసంబంధమూలవ్యాధులకు చికిత్స

దుష్టూరాది చూర్ణము.

శుద్ధిచేసిన ఉమ్మెత్తగింజలు పిప్పళ్ళు శొంఠి కరక్కాయ పెచ్చువట్టివేళ్లు వీటినిసమభాగాలుగా చూర్ణించి యెనిమిది గింజలచూర్ణ

ముసందు ౧ తులము నెయ్యి ౧తులము తేనె ౧ తులము చక్కెర చేర్చి రాత్రులందు సేవించుచుండిన పిత్తమూలము నసించును.

255 రక్తమూలమునకు చికిత్సలు.

శుద్ధిచేసిన విషముష్టి విత్తనములు ఆరుగాని యేడుగాని యెనిమిదిగాని బాగుగాచూర్ణించి చక్కెరతో కలిపి పుచ్చుకొనవలెను. త్వక్కుదోషములు నశించును క్రిములు పడిపోవును. రక్తమూలము నశించును.

రక్తమూలము

వేపచెక్క తు ౧ యెండబెట్టి చూర్ణించి వస్త్రఘూళితంచేసి భద్రపరచుకొనేది. దున్నను ఈనిన గేదెయొక్క పెరుగులో నాలుగుచిన్నాలెత్తు ఔషధమువేసి బాగాకలిపి మూడుపూటలు ప్రొద్దుటపూట పుచ్చుకొనేది. పెరుగుఅన్నము చప్పిడిపత్యము.

రక్తమూలము

ఉత్తరేణివిత్తనాలు బియ్యపు కడుగులోనూరి వుడికించి పుచ్చుకొనేది రక్తస్రావముగల మూలవ్యాధులు హరించును.

మరోవిధము.

నేలగుమ్మడిచెక్క నువ్వులు సమభాగాలు దంచిఆవుపాలతో నూరి కల్కముచేసి తేనెకలిపి సేవింపవలెను. రక్తమూలము నివారణమగును. నిస్సంశయము ॥మరిన్ని పూవులను సమముగా ఆవువెన్నవైచి నూరి సేవించినను రక్తమూలము నివర్తించును.

మరొకవిధము

నాగకేసరముల చూర్ణమునకు సమభాగం ఆవువెన్న చక్కెర చేర్చి నూరిసేవించిన రక్తస్రావముభాధ తొలగి నివారణమగును.

## 256 మూలవ్యాధికి-చికిత్సలు.

నల్లని వెంప్రుకలు ౧ శేరు తీసికొని వచ్చి చవుడునీటిలో మూడుదినాలు నానవేసేది. నాలుగోదినము మంచినీటితో బాగా కడిగి శుభ్రముచేసి, ఒకమూకుడులో గేదె పెరుగుబోసి పైజెప్పిన వెంప్రుకలు అందులోవేసి మరొకమూకుడుపైన బోర్లించి, దానికి చుట్టున్ను సరిగా మినుప పిండి పొదిగి దానిపైన గుడ్డచుట్టి గాలి యే మాత్రము రాకుండు నట్లుకట్టి చీలమన్నిచ్చి ఆరనిచ్చి గజపుటము బెట్టేది. అంతట భస్మమగును. గురిగింజయెత్తు భస్మమును ఆవువెన్నతో సేవించేది. మూలవ్యాధి హరించును.

## 257 రక్తమూలమునకు, రక్తముపడేదానికి, విరోచనములకు, గ్రహణికి, రక్తవిరేచనములకు చికిత్స.

మాచికాయలు అయిదు మెత్తగానూరి, కోడిగ్రుడ్డులోని తెల్ల సొనవేసి నూరి మాత్రఅయ్యేలాగున చేసి కుంకుడుగింజంతేసి మాత్రలు కట్టి ప్రొద్దుటను, సాయంకాలమునను ఒక్క మాత్ర చొప్పున సేవింపవలెను. అట్లు అయిదు దినాలు.

పథ్యము—పెరుగు అన్నము, లేక నెయ్యి అన్నముగాని, వెన్నతోటి న్ని తినవచ్చును.

## 258 వాతసంబంధ అర్శోరోగమునకు-చికిత్స.

లక్షణము :—వాయువు ఆసనద్వారమున వెడలుచుండుట, విరేచనము ఉండలుండలుగా వెళ్ళును. చీమువిరేచనముతో కలిసియు, కలియకను గూడపడుచుండుట, ఆసనమునొప్పి, పోటు, గలిగియుండుట, మలబద్ధకముండుట, ఇవిమూలవాతమున కుండును.

259 మరీచాదిచూర్ణము.

మిర్యాలు, పిప్పళ్ళు, శొంఠి, చెంగల్వకోష్టు, చిత్రమూలము, వస, యింగువ, సైంధవలవణము, వాయువిడంగాలు, కరక్కాయచర్మము చిత్రమూలము, వామము ఇవి సమభాగాలు చూర్ణించి, ఆచూర్ణము నకు రెండు వంతులు బెల్లముచేర్చి, బాగాదంచి, వేడినీళ్లతో పూట వకటింటికి వక తులము చొప్పున సేవించిన వాతసంబంధ జనితమూల ము నివర్తించును. మరియు సర్వమూలములున్ను నివర్తిఅగును. వయస్సు, రోగ బలా బలములు, సాధ్యాసాధ్యాదులు, తెలిసి మం దు నడుప వలెను. పత్యములేదు.

260 మూలములూడిపడిపోవుటకు-చికిత్స.

అమృతపాణి అరటిపండు లోపల యాగానియెత్తు జీడిపెట్టి మూడుదినాలు ప్రొద్దుటిపూట పుచ్చుకొనేది.

261 ఇందులకు-ధూపము.

ఇంగిలీకము, ఉత్తరేణిబియ్యము, ఆదొండచెక్క, పందిరెట్ట, వీటిని చూర్ణించి చింతబెరడు నిప్పులలో పొగవేసేది. ఆపొగ ఆసన మునకు పట్టు నట్లు కూర్చొనేది. మూడు నాలుగు రోజులలో కుళ్లి మొలకలు పడిపోవును. పిమ్మట పిండికట్టుకట్టవలెను. పత్యమేమీలేదు.

262 ఆసనములో చురుకు, రక్తముపడుటకు-చికిత్స.

నీరుల్లి అయిదు తులములు సన్నముగా తరిగి పందినేతిలోవేపి, యేడు దినాలు పుచ్చుకోవలెను.

263 పిలకలూడి పడుటకు-ధూపము.

మురదారుసింగు ౧ తులము దీనితో జీడిగింజలు తొమ్మిది, మరిన్ని మామిడిటెంకలోని పప్పు, దుంపపసుపు వీటిని మెత్తగానూరి తొమ్మిదివుడలుగా చేసి పొగవేసేది. పిలకలు పడిపోవును.

264 మూలవ్యాధికి-లేపనములు.

బొంతచెముడు చిగుళ్ళు, కటకరోహిణి, చేదు ఆనప చిగుళ్లు, కానుగుగింజలు, ఈదిరుసులను సమభాగాలు చూర్ణించి ఆచూర్ణము లో జిల్లేడు పాలు, మేక మూత్రమున్ను పోసి బాగానూరి, ఉడికించి కాస్త వెచ్చ వెచ్చగా నుండేటట్టు మూలవ్యాధికి (పిలకలకు) లేపనము చేయవలెను. మొలకలూడి పడిపోవును.

265 మూలవ్యాధికి-పొగవేసేక్రమము.

ఏనుగుచర్మము, రక్కసపుగింజలను చూర్ణముచేసి, ఆచూర్ణము పిడతలోబోసి మూతవేసి చీలమన్నుయిచ్చి పాతాళయంత్రమున బెట్టి తైలం తీసి, మూడులేక నాల్గుచుక్కలు నిప్పులమీదవేసి పొగ తగిలేటట్లు (మూలములకు) సాధనముయేర్పరుచుకొని కూర్చుండవలెను. ఆలానాలుగైదు రోజులు ఆసనానికి పొగవేయవలెను. మొలకలు ఊడిపడును. పత్యం లేదు.

266 మూలవ్యాధికి పట్టు

గురివింద గింజలున్ను అడివికందయున్ను సమాంశాలు చన్నీళ్ళతో బాగుగానూరి పట్టువేసిన యెడల బాధతగ్గును. పత్యములేదు

## 267 మూలశంకకు లేపనము

మర్రి ఆకులు కాల్చి మసిచేసి ఆబూడిదను మంచినూనెలో మర్ది
న చేయవలెను. లేపనము చేయవలెను.

## 268 మూల శంకకు పత్యాకరములు

గలిజేరు కూర, చాతరాసికూర, చిత్రికూర, లేతవగు అత్తికా
యలు పెద్దములకకాయలు చిన్నములకకాయలు మిర్యాలు సైంధవ
లవణము ఆవువెన్న యింగువ ఆవుచల్ల ఆవునెయ్యి పొట్లకాయ కంద
గడ్డమున్నగునవి.

## 269 అపత్యములు

పెరుగు తెలగపిండి మినుములు వంకాయ బచ్చలి కఠినపదా
ర్థములు మిక్కిలి శీతలపదార్థములు చలినీళ్ళు మత్స్యములు మాంస
ము పప్పు చారకంద మొదలగునవి విస్తారముసేపు గొంతుకూర్చుండు
ట దూరము నడుచుట కూడదు.

## 270 బిళ్ళరోగనిదానము.

ఇది సవాయిసంబంధమైనవిషము వ్యాపించుట వలనఅంకురిం
చును. అందువలన మొదట రక్తముచెడును. ఒకగజ్జలోగాని రెండు
గజ్జలలోగాని బిళ్ళలు బైలుదేరును. మొదట వాపుకనిపించును. గడ్డ
వలె కనపడును. అనంతరం కురుపులాగున ఏర్పడును. అంతకు ముం
దు జ్వరము వచ్చును. చలివచ్చును. అన్నహితవు తగ్గును కాళ్ళు
పీకు. తలనాదు సంభవమగును. సలుపు పోటు గలిగి బిళ్లలు భరింపశ
క్యము కాకుండును గజ్జలలో ఇవికనపడిన తోడనే విరేచనములకు
మందు పుచ్చుకొనుట శ్రేష్ఠము. చీమువృద్ధికాకుండునటుల పత్యముగా

నుండవలెను చితుకుటకు చీముకారిపోవుటకు (చీముబోడి పోవుటకు
చికిత్సచేయింప వలెను లోపలికి ఔషధ సేవచేయుట మంచిది.

### 271 బిళ్ళరోగములకుపత్యములు

బీరకాయ పొట్లకాయ చిక్కుడుకాయ కాకరకాయ అరటి
కాయ నిమ్మకాయ దబ్బకాయ ఉశిరిక పచ్చడి తోటకూర కందిపప్పు
నెయ్యి పాం . నీళ్ళు మొదలగునవి.

### 272 బిళ్ళరోగములక పత్యము

కంద నూనె ఆవ బచ్చలి పులుసు పాలు మజ్జిగ పెసరపప్పు
చీముపట్టునట్టి పదార్థములు.

### 273 అడ్డుకట్టులక్షణం

రెండుపైపుల గజ్జలలోనికి సరిపడునట్లు అడ్డముగ అరటికాయవలె
ఏర్పడును. పోటుండును. చలి జ్వరము వచ్చును. అన్నమందభిలాష
లేకుండును బలహీనం కాళ్ళుపీకు విరేచన బద్ధకము ఉండును.

### 274 బిళ్ళలకు పట్లు కట్లు పాలాస్త్రులు.

1 కోడిగుడ్డు నందలిచోన రాతిసున్నము నూరి పట్టువేసిన
మానును.

2 మర్రిపాలు గుడ్డకు అంటించి పట్లువేసేది.

3 కాడచెముడుపాలు గుడ్డకు పట్టించి పట్టువేసేది.

4 బిళ్ళలు ముదరకుండినప్పుడు పరిధమంలో పచ్చగన్నేరు పాలు
పాడిచి పట్టీవేస్తే పోవును.

5 బొడ్డచెట్టుపాలు, రాసున్నం కలియనూరి పట్టీవేసేది.

6 తెల్లఉప్పిఆకు, వెల్లుల్లి బాగానూరి బిళ్ళలపై పట్టీవేసేది.

7 కరకతాటి ఉశిరికలపప్పును చెముడు పాలతోనూరి పట్టీవేసిన హరించిపోవును.

8 విభూతి రాసున్నము, ఆముదముతో నూరి పట్టువేసేది.

9 పర్నావాలు వెల్లుల్లి మెంతులు చిత్రిమూలము ఇవి సమభాగాలు నీటితోనూరి పట్టువేసినమానును.

10 గుగ్గిలము 1 తులము మైనము 1 తులము దాల్చినచక్క పావుతులము లవంగాలు పావుతులము ఆముదము అరతులము ఈవస్తువులను చూర్ణముచేసి ఉడికించి పట్టివేసిన మానును.

11 కత్తిమందు వెచ్చచేసి బట్టకంటించి బిళ్ళలపై పట్టీవేయవలెను

12 రససింధూరం కోడిగుడ్డునందలిసొన కొత్తిమ్ముగ్గు కలియనూరి పట్టువేయువలెను.

13 సాంబ్రాణి గుగ్గిలము ముసాంబ్రము కత్తిమందు నాభి కట్టునూనె ఇవిబాగానూరి పట్టించినమానును.

14 బంగాళాదుంప (ఊరలగడ్డ) కుమ్ములోనుడికించినూనె గుడ్డతో పట్టీవేయవలెను. కాగిపోవును.

275 బిళ్లలకు కట్లు

15 అరటికాయ ఉడికించిముద్దకట్లు కట్టినను పొత్తిదుంప ఆవుపాలతోనూరి ముద్దకట్లుకట్టినను అణిగిపోవును. విరేచనమునకు ఔషధం అరగాగిపోయినంత వెంటనే పుచ్చుకోనేది.

16 ముళ్ళతోటకూర ఆముదమున వెచ్చజేసి కట్టవలెను.

17 వెల్లుల్లి ఆవాలు ముంగచక్క వస ఈదినుసులు చూర్ణించి గుడ్డలోవైచి కట్టేది.

18 గొట్టపెంట రాసున్నము కలిపి కట్టుకట్టేది.

19 పొత్తిమంప ఆవాలు వెల్లుల్లి మెంతులుచిత్రిమూలము తెల్లదూసరదుంప, సమభాగాలు మెత్తగానూరి కట్టుకట్టేది.

20. చింతపంసుగుంజు, వెల్లుల్లి, కొంచెముఇంగువ, మర్దించి, కట్టిమూడుదినాలుంచి పెమ్మటతీసివేసి వేడినీటితో కడిగి శుభ్రముచేసేది.

21. ముళ్ళతోటకూర దంచి వంటాముదాన వెచ్చచేసిఅయిదారు కట్లు కట్టినచోమానును. విరేచనమునకు పుచ్చుకోవలెను.

276 బిళ్ళలకుకోతపలాస్త్రి.

22. తూటిఆకుపాలతో ఉమకబెట్టిఆముదముతో ముందుగాచమిరి 5—6 కట్లుకట్టేది. చితికె బిళ్ళనుండి చెమపదార్థముపోవును. ఆవెనుక తులముగుగ్గిలము, తులముమైనము, నేతిలోకరిగించిపాలాస్త్రిపట్టీ వేయవలెను. మానును.

277కోతకు, మానుటకు, హరించుటకు పలామాలు.

23. శుద్ధిచేసినమైలతుత్తము ౧ తులము, గంగసింధూరము పావు తులము, గుగ్గిలము రెండుతులాలు, ఇవిచిట్టాముదముతో బాగానూరి ఉడికించి బిళ్ళపై పట్టీవేయవలెను.

24దాల్చినిపావుతులము, లవంగాలుపావుతులము, గుగ్గిలంతులం, మైనంతులం, ఆముదము రతులము, ఇవివండికోతకుపట్టీవేయువలెను.

278 బిళ్ళలకు కోతపలామాలు.

25 గుగ్గిలము రెండుతులాలు, గంగసింధూరముపావుతులము, సాంబ్రాణిపావుతులము, మైలతుత్తముఅరతులం, (మజ్జిగతో శుద్ధిచేసినమైలతుత్తం) ఈదినుసులు చిట్టాముదముతో నూరిపట్టీవేయవలెను.

26 రససింధూరముపావుతులము (మంచిపలచనైనముక్క) గేదెవెన్నతోమర్దనాచేసి బిళ్ళపై పట్టీవేసిన మానును.

279బిళ్ళలుకాగిహరించుటకు పసర్లు.

27 బిళ్ళకుడిప్రక్కనున్న యెడమచెవిలోను, యెడమప్రక్కనున్న కుడిచెవిలోను, రెండుప్రక్కలరెండుబిళ్ళలుండిన రెండుచెవులలోను ఉత్రిం

దచెప్పిన పసరులలో దేనినైనపిండవలెను. ఏదిపిండినను హరించిపోవు ను. పసర్లేవనగా నల్లఉమ్మెత్తాకుపసరుగాని, కాకిదొండాకుపసరుగాని, వావింటాకుపసరుగాని, దొండాకుదుష్టుపాకుపసర్లుగాని, తెల్లగన్నేరాకు పసరుగాని, పైచెప్పినప్రకారంపిండవలెను.

28 మినుములు ములగచెక్క రసముతో నూరి బిళ్లల పైపట్టీ వేసి కట్టుకట్టిన హరించును.

29 గుగ్గిలం, నల్లమందు, నూనె, నల్లజీడిగింజలరసాన నూరి మెత్తగావచ్చిన తరువాత గుడ్డకుపట్టించి బిళ్లలపై వేయవలెను. రెండు పట్టీలకు కరిగిఅరగానిపోవును.

## 280 బిళ్లలకు-అడ్డగర్రలకు-ఔషధములు.

30 చీనాపంచదారలో మజ్జిగపాలు కలిపి పూటకు ౧కి గచ్చకాయ ప్రమాణంగా మాత్రి పుచ్చుకొనిన హరించును.

## 281 వరిబీజము-(అండవృద్ధి)

శగసంకటము జీర్ణించిన వారివృషణము పెద్దదగుచున్నది. కొందరికి రెండు వృషణములు పెద్దవగును. వరిబీజము అనగా ఒక అండము (ఏపార్శ్వమునైన) పెద్దదిగనుండుట. రెండు అండములు పెద్ద వైన బుడ్డ అని అందురు. వీట్లకుపట్లు, కట్లు, కోట్లు, (శస్త్రము లేక ఆపరేషను అని ఇంగ్లీషు) రకులు, నీరుతీయించుట, ఔషధముసేవిం చుట మున్నగునవి చేయనగును.

1. కొబ్బరికోరును ఆముదముతో వెచ్చచేసికట్టిన బుడ్డలు హరించును.
2. నల్లమందునకు నాల్గునంతులు మైనముకరిగి వెచ్చ వెచ్చగా వృష ణముమీద వేసి గుడ్డకట్టేది.
3. గచ్చచిగుళ్ళు ఆముదముతో వెచ్చచేసి కట్టవచ్చును.
4. చింతపండు, సున్నము కలిపికట్టవచ్చును.

5. కుమ్మలో వెలక్కాయనుంచి ఉడికించి ఆగుంజుతో పసుపు చూర్ణము చేర్చికలిపి కొంచెమువేడిగానుండునట్లు కట్టు కట్టవలెను.

282 వరిబీజమునకు పట్లు

6 ములగబంక నల్లమందు నేతితోనూరి పట్టువేసిన హరించును.

7 పాపిటివేరునీటితో అరగదీసిపట్టించేది.

8 వస ఆవాలు నూరిపట్టీవేసినను గంటుభారంగి బియ్యపుకడుగు తో నూరి పట్టువేసినహరించును.

9 కోడిగుడ్డులోని సొనతో రాతిసున్నమును నూరి పట్టింపవలెను మరియు విభూతి రాతిసున్నము ఆముదముతో నూరిపట్టించినను శమించును.

283 వరిబీజమునకు ఔషధము

పాలు ఆముదము సమభాగాలు చేర్చి పూటకు రెండుతులాలు చొ॥ సేవించుచువచ్చిన హరించును.

284 అండవృద్ధికి జకోటా చుట్లు

కాలిబొటమన వేళ్ళకు రెంటికిని బిగువుగా యెల్లప్పుడు ఉండునట్లు ఏచుట్లు అయినా పెట్టుకొనవలెను.

285 రణాలకు చికిత్సలు

హంసపాది ఆకు మిరియాలు ఈరెండునూరి పెద్దవాళ్ళకు మానని రణములకుకట్టేది. మానును. చిన్నవాళ్ళకు చేలవత్యాకు దుంప పసుపునూరి కురుపులకు కట్టినమానని కురుపులుమానును.

286 పాలాస్త్రి చేసేక్రియము

చిందూరము అరతులము యుంగిలీకం పావుతులం దికామల్లి పావుతులం మురదారుసింగ్ పాతుపులం మైనం మూడుతులాలు ఈ

వస్తువులు మెత్తగానూరి నాల్గుతులాలు నెయ్యిబాగా కాగబెట్టి అందు చిందూరం యింగిలీకము ఈరెండువదలవలెను. అనంతరము అన్నివస్తువులువేసి పది నిమిషములు ఉడికించి దించేటప్పుడు మయినము అందులోవేసేది పాలాస్త్రి అగును.

## 287 భగందరము

గుథమునకు రెండు అంగుళములు సమీపముగా కురుపుబయలుదేరి పోటుతోనుండును పగిలినభగందరమందబడును.

భగందరమువలన వాయువు మూత్రపురీషములు క్రిములు శుక్రము వెడలిన ఆరోగ్యబ్రతుకడు. జీవించు నంతవరకు చికిత్సచేయుచుండవలెను.



## 288 భగందరరోగమునకు చికిత్స

రసకర్పూరమును నేతితోపుచ్చుకొనవలెను. వెంటనే నేలతాడిగడ్డలు వెల్లుల్లిపాయలు కలితోనూరి త్రాగవలెను. హరించును.

4 తు॥ తక్కలివేరుచూర్ణము నెల్లివేళ్ళచూర్ణము నాల్గుతులాలు రసకర్పూరము అరతులము వీటిని కల్వములోవేసి గూడ పాల వేళ్ళ రసాన మర్ధనచేసి 80 మాత్రలు చేసి మండలము రోజులు రేపట మాపట ఆవునేతితో సేవింపవలెను. భగంధరాలు లూతవ్రణాలు హరించును.

## 289 భగంధరమునకు విడంగాది పటుకములు

వాయువిడంగాలు, కొడిశల పిప్పళ్ళు ఇవి సమభాగాలు చూర్ణించి దీనికి రెండింతలు శుద్ధిచేయబడిన మహిసాక్షి గుగ్గిలము గుగ్గిలమునకుసమం కరకతాండ్రి ఉశిరికలచూర్ణము కలిపి బాగుగా నేతితో మర్ధనచేసి తేనె అనుపానముతో కర్షపరిమాణమువాత భగందరము హరించును.

### 290 భగంధరమునకు వర్తి

బొంత చెముడుపాలు జిల్లేడుపాలు వీటితో మానిపసుపునూరి గుడ్డకుపట్టించి వర్తిచేసి భగందరమున నుంచిన హరించును.

భోతాంకుశపువేళ్ళు చూర్ణములో గాడిద నెత్తురువేసి కలిపి కుక్కయెముక చాది లేపనంచేసిన యెడల భగందరములు హరించును.

### 291 గండమాలలకు చికిత్స

జిల్లేడుపాలతో పాపరవేరునూరి సైంధవలవణమును కలిపి లేపనము చేసి నిప్పుశెగను కాచేది. గండమాలలు హరించును.

యష్టిమధుకమును బోడసరరసముతోనూరి త్రాగేది. 7 దినములు చేయవలెను. హరించును.

### 292 గండమాలలు బిళ్ళలుగాని గొంతుక మొదలుకొని మెడలవరకు బయలుదేరినవాటికి చికిత్సలు.

పాలసుగంధి ౧౫ తులాలు తెచ్చి ౧ పయింటు కషాయందించుకొని అందు ౧ ఔన్సు సర్ప్ఫరి ఆయొడైడ్ కలిపి దినానికి మూడు పూటలుత్రాగించేది, రెండుపర్యాయాలు ఔషధంయిచ్చేది. ఇచ్ఛాపత్యం చిట్లపిరంగి మొదలగు రోగాలు బిళ్ళలు గండమాలలు మానును.

### 293 సవాయిరోగములకు చికిత్స

అయిలారం చేదుజీలకర్ర కొడిశపాల కురాసానివాము సుగంధి ఇవి సమభాగాలు నీళ్ళతో మర్దనచేసి కుంకుడు గింజపరిమాణము మాత్రలు కట్టి అయిదు రోజులిచ్చేది. ఇచ్ఛాపత్యము తొమ్మిది రోజులు కూడా యియ్యవచ్చును.

## 294 పాతసవాయీ కు చికిత్స

తెల్లజిల్లేడు వేరు చెక్క కానుగచెక్క గోలుగు చెక్క తురక వేపచెక్క చంద్రచెక్క ములివెంపలివేరు చెక్క ఫిరంగిచెక్క చిత్రమూలము గచ్చచెక్క కలివిందచెక్క దుష్టపువేరుచెక్క పిప్పలికట్టె చంగల్వకోష్టు పాలకొడిశ మిరియాలు శొంఠి వేపపువ్వు జిలకర్ర తక్కోలపుష్పు వాయువిడంగాలు శుద్ధిచేసిన గంధకం విష్ణుమధుకం ఇవిసమభాగాలు చూర్ణించి పూటకు అరతులంచొప్పున నీళ్ళతోగాని తేనెతోగాని ఆవునేతితోగాని పుచ్చుకొనేది. ఇందువలన పాతసవాయి కొత్తసవాయి అన్నియు కుదురుటయే గాక అష్టకట్టు పచ్చశగ రొచ్చు కొరుకు మొదలైన సుఖజాతులన్నియు నివారణమగును.

## 295 అన్నిసవాయిలకు

పాదరసము ౧ అమరశిల గంధకం ౧ కురాసానివాము ౧ కురంజివాము ౧ మంచివాము ౧ యెండుకొబ్బరి ౧ నువ్వులు ౧ పాత బెల్లం ౮ తులాలు జీడిగింజలు 3 తులాలు ఈవస్తువులు 50 నిమ్మపండ్ల రసములో మర్దనచేసి కుంకుడుగింజ ప్రమాణం మాత్రకట్టి ప్రొద్దుట సాయంకాలాల ఆవపిండితో ఒక్కమాత్ర పెట్టియిచ్చేది. బెల్లముమజ్జిగ వర్జము తక్కినపదార్థములు తినవచ్చును.

## 296 సవాయిరోగములకు చికిత్స

రేవల్చిన్ని అరతులము ఇంగిలీకం అరతులము చిత్రమూలము పావుతులము తుమ్మాకు దమ్మిడియెత్తు తెల్లజిల్లేడు పట్ట దమ్మిడియెత్తు మిరియాలొక దమ్మిడి యెత్తు ఈదినుసులు బాగానూరి మాత్రలుకట్టి పూటకొక మాత్ర చొప్పున 14 దినములు యియ్యవలెను. కందిపప్పు కందికట్టు కంద మొదలగునవి పత్యముపులుసువర్జము.

## 297 ఇంగిలీక మైనం.

శుద్ధిచేసినఇంగిలీకము, హారతికర్పూరము, గవ్వపల్కుసాంబ్రాణి, ఈదినుసులుసమభాగములు అపునేతితో మర్దనచేసి కరాటాను పెట్టవలెను. పెసరగింజప్రమాణముగ మాత్రనిచ్చిన సవాయినివారణమగును.

తెల్లతుమ్మ, కన్నెమామిడి, బాడిద వీటిచక్కలు తెచ్చిసమభాగములుఉండజూచుకొని దంచిరసముతీసి,ఆరసము మూడుడబ్బులెత్తులో ఒకడబ్బుయెత్తు దిగుదాయినూనె మిశ్రముచేసి మూడుదినములు ప్రొద్దుటనెపుచ్చుకొనేది. చప్పిడిపత్యము.

దుష్టుపువేరు రెండుతులాలు, వెల్లుల్లితులము, పిప్పళ్ళుతులము ఇవిఅన్నిటిని కలియనూరె మాత్రలుకట్టి దినమునకురెండు మాత్రలు చొ॥ పుచ్చుకొనేధి. పాలుఅన్నము, కందికట్టు, వేయించినఉప్పువాడుకొనేది.

పావుశేరునల్లజీడిగింజలు, పావుశేరుప్రాతచింతపండు, కట్టుతోట బాగాదంచి కుంకుడుగింజంతేసి మాత్రలుకట్టి ఏడుదినాలుసేవించేది.

పోకలుమాడ్చి పొడిచేసి అందులో తెల్లకవిరినూరి కల్పిపూట కుడబ్బెత్తు భక్షించవలెను. మూడుపూటలుచప్పిడిపత్యము

### కొరుకుసవాయికిచికిత్స

జిల్లేడువేరు, యింగిలీకం అక్కలకర్ర, ఈమూడింటిగంధంపట్టించిన హరించును.

## 299 సవాయిపుండ్లకు-మలామా.

రసకర్పూరం పావుతులము, ఇంగిలీకము అర్ధపావలాయెత్తు అనగా బేడయెత్తు) ముర్దార్‌సింగు బేడయెత్తు, హారతికర్పూరము)

బేడయెత్తు, కల్వాపకాకరాకు పసరుకు బాగా మర్దనాచేసి వెన్నతో కలిపి కోడి యీకతో. గాని, కాకి యీకతోగాని పుండ్ల మీాదరాచిన మానిపోవును.

### 300 సవాయిపుండ్లకు-లేపు.

రెండుతులములు రసకర్పూరము ఆవువెన్నతో పలుకులు లేకుండా బాగానూరి, మేడిపాలుకల్పి లేపుచేసేది. అయిదురోజులు చేయవలెను. పత్యములేదు.

### 301 సవాయిరోగములు, మేహపొడలు, దద్దులు, పైత్యపు మచ్చలు మొదలగువాటికి చికిత్స.

కురంజివాము, కురాసానివాము, నల్లజీలకర్ర, నల్లజీడిపిక్క మోదుగమాడలు, రేనల్చిన్ని, పిరంగిచెక్క, శొంఠి, మిర్యాలు, చిత్రమూలం, దాల్చినిచెక్క, లవంగాలు, నాగకేసరాలు, ఇంగిలీకం, రసకర్పూరము, పాదరసము, శొంఠి, గంధకం, మైలుతుత్తము, ఇవి శుద్ధిచేసినవిగా ఉండవలెను. ఇవి సమభాగాలు మూడుదినాలు నిమ్మపండ్లరసాన కల్వములో బాగుగ మర్దనచేసి గాజుగిన్నెయందుంచి పూటకు శెనగగింజంత ప్రమాణం గా మాత్రచేసికొని 40 దినాలు రెండు పూటలు సేవింపవలెను. మందు అరిపోవుచుండిన నిమ్మపండ్లరసముతో నేపదురు చేసుకొంటుండవలెను. ఆవ, బచ్చలి, ఆవకాయ వర్జ్యం. పులుసుకూడనే కూడదు.

### 302 సుఖజాతులన్నిటికి-చికిత్స.

రసకర్పూరము, రససింధూరము, సవీరం, రేకుతాళకం, పాదరసము, గంధకం, ఇవి సమభాగాలు చూర్ణించి లేతకొబ్బరికాయ తెచ్చి రెండుగా పగలగొట్టి, నీళ్ళుతీసి, కాయ చెక్కలోపోసి రెండో

చెక్క మూసి మూడుసార్లు చీరమన్నిచ్చి పుటం బెట్టి, కొబ్బరికా య నీటితో మర్దించి, శలగగింజప్రమాణముగా మాత్రలుచేసి పూట కు వక మాత్రి చొప్పున ఇచ్చిన మానును. ఇచ్ఛాపత్యము

శగకు కారుపిప్పలిఆకు రసముతోను, సవాయిాలకు బలరక్కసి ఆకురసముతోను పైనిపూతకు రాయవలయును.

## 303 శగసంకటమునకు చికిత్సలు

మంచికలబంద తెచ్చి పైపొప్పరతీసి లోపలిగుంజుమెత్తికొని దానితో సూరేకారము మెత్తగానూరి ఆ నూరినదానిని కుక్కుట పుటము వేయవలెను భస్మమయిన పిదప పూట 1 కి చిన్నమెత్తు చొ ప్పున రేపట మాపట మూడురోజులు పుచ్చుకొనవలెను. పత్యములేదు

## 2 చికిత్స

తేనెగవ్వలు శ్రేష్ఠమైనవి 40 తీసికొని ఒకగిన్నెలో నిమ్మపండ్ల రసము పావుశేరు పిండి ఆరసములో పైనచెప్పిన గవ్వలువేసి ఆరుదినాలు యెండలో పెట్టవలెను. భస్మమగును ఆభస్మమును పూటకు అరతుల ము యెత్తుచొ 4 నింమ్మపండ్ల రసముతో చేర్చిసేవించిన శగసంకటము హరించి పోవును. ఇందుకు పత్యములేదు.

## 3 చికిత్స

పచ్చివి వులవలు వకతులము యింగిలీకము అరతులముఈరెండు దినుసులుబాగుగానూరి మూడుదినాలు రేపు మాపుపు చ్చుకొనవలె నుశగనివర్తించును చప్పిడి పత్యము.

## 4 చికిత్స

నేలవుశిరిక గంగరేగుచెక్క వన్నావాలు మూడుమూడు దినుసులు మెత్తగానూరి సేవించిన శగరోగము నివర్తించును. చప్పిడి పత్యము చేయవలెను.

5 చికిత్స

జీలకర్ర నేలవులిమిరాకు ఈరెండును మెత్తగా కలియనూరి పూట 1కి గచ్చకాయంత చొప్పున పుచ్చుకోవలెను, యిచ్ఛాపథ్యము.

6 చికిత్స

మూడుడబ్బులెత్తు వేపాకురసము పింగానిగిన్నెలో పోసి చీనా కొంచెము చేర్చి ప్రొద్దుననే పుచ్చుకొనేది. ఆవుమజ్జిగ అన్నముతినేది మరిన్ని కాకిదొండ ఆకుదంచి పసరుతీసి రెండు డబ్బులెత్తు యెత్తుకొని గిద్దెడు పెరుగులో వేసికలుపుకొని త్రాగినను శగనివర్తించును, చప్పిడి పథ్యము

7 చికిత్స

చలవ మిర్యాలు జమ్మిచిగుళ్ళు ఈరెండు రెండు యాగానులి మెత్తు చూచుకొని ప్రాతఃకాలమునందు నోట్లోవేసుకొని నమ్ఛి మ్రింగవలెను. ఈలాగున మూడుదినములు చేయవలెను. ఇచ్ఛా పథ్యము

8 చికిత్స

పిండిదొండాకు రసం మునగాకురసము రెండేసి తులాలున్ను తెల్లజీలకర్ర పంచదార ఈరెండు రెండుపావలాల యెత్తున్ను ఉండ చూచుకొని అన్నికలిపి 7 దినాలు లోనికి సేవించవలెను. ఆవునెయ్యి కందిపప్పు ఆవుమజ్జిగ తినవచ్చును.

9 చికిత్స

కోరింతచిగుళ్ళు మిరియాలున్ను కలియనూరి సేవించవలెను. పూట 1కి యింటుపకాయంతప్రమాణము మాత్ర యిచ్ఛాపథ్యము

## 10 చికిత్స

నల్లవుప్పిచెక్క చూర్ణము రెండుతులాలు తుంగదుంపల చూర్ణము వకతులము యీచూర్ణములు రెండు కలిపి అందు చెందిని వక ఔన్సుపోసి చక్కగా మాత్రి కట్టుకు వచ్చునట్లునూరి కుంకుడు గింజ సుమారు మాత్రిలు కట్టి పదిరోజులు పుచ్చుకొనేది.

## 11 చికిత్స

రసచిందూరము లవంగాలు ఈ రెండును రెండరతులాలు వెంపలిచిగుళ్ళు అరతులము కలిపి మూటిని మెత్తగా నూరి మాత్రిలు కట్టి అయిదుదినాలు రేపూ మాపూ పుచ్చుకొనేది. శగనివర్తించును. ఇచ్చాపత్యము.

## 12 చికిత్స

ములుగోరింటాకు మిర్యాలు యీరెండు సమభాగములు మెత్తగానూరి 5 దినములు ప్రొద్దుట సాయంత్రిం ఆవుపెరుగులో కలిపి పుచ్చుకొనవలెను. ఇచ్చాపత్యము,చప్పిడి.

## 13 చికిత్స

రుద్రిజడగింజలు చూర్ణించి దీనికి సమం వంగభస్మమును చీనాపంచదారతో కలిపి సేవించేది. పూటకు నాలుగణాల యెత్తు రేపు మాపు రెండుపూటలా మూడుదినాలుపుచ్చుకొనేది పత్యంలేదు

## 14 చికిత్స.

రెండుతులాలు పంచదార, మిరియాల చూర్ణము పావలాయెత్తు ఈరెండు నాల్గుతులాలు మజ్జిపాలతో కలిపి మాత్రిలుచేసి మూడు ప్రొద్దుటిపూటలు పుచ్చుకొనవలెను. చప్పిడి.

15 చికిత్స.

తులము రుద్రజడ గింజలు (సబ్జాగింజలు) కొత్తకుండలో నీళ్ళు పోసి అందుపై గింజలువేసి కొన్ని నిముషములు నాననిచ్చి తులం చీనా పంచదారవేసి కమ్మగా మూడునాలుగు దినాలు ప్రొద్దుటపూట పుచ్చుకోవలెను. పథ్యము లేదు.

16 చికిత్స.

పూటకు అరతులం తంగేడువేరుపట్ట మెత్తగానూరి ఆవుచల్లలో కలుపుకొని 20 దినములు పుచ్చుకోవలెను. పత్యమునహి.

17 చికిత్స.

జిలకర్ర, ధనియాలు, సబ్జాగింజలు సమాంశాలు చూర్ణము చేసి ఆచూర్ణము యెంతయెత్తో అంతయెత్తు లవంగ చూర్ణముకలిపి సేవించేది. గేదెచల్లలోవేసికొని పుచ్చుకొనవలెను. కానిపత్యములేదు.

18 చికిత్స.

9 మిరియాలుచూర్ణించి, 1 గిద్దెడు యేనుగు పల్లేరుఆకురసము లో వేసి గలిపి రేపు మాపు మూడుదినాలు సేవించేది. చప్పిడిపత్యము చేయవలెను.

19 చికిత్స.

రెండణాలుయెత్తు సురేకారం, 1 డబ్బుయెత్తు మంచికలబంద గుజ్జులో చేర్చి సేవింపను శగరోగము హరించును. పత్యములేదు. మూడుదినాలుచేయవలెను.

20 చికిత్స.

మెంతులునూరి గేదెపెరుగులో కలిపి సేవించవలెను. చప్పిడి పత్యము. మజ్జిగ-అన్నము.

## 21 చికిత్స.

ఉస్తిఆకు మిర్యాలు కలియనూరి మాత్రలు సెలగగింజలంతేసి చేసి అయిదు దినాలుపుచ్చుకొనేది.

## 22 చికిత్స.

సాలామిశ్రి, సపేద్‌మిశ్రి, జాజికాయలు, జాపత్రి, లవంగాలు, పెన్నేరుగడ్డ, నేలతాడిగడ్డ, అక్కలకర్ర, ఈదినుసులు సమభాగాలు చూర్ణించి, ఆచూర్ణమునకు సమముగా చక్కెరకలిపి పూటకు అరతులం చొప్పున పుచ్చుకొనేది.

## 23 చికిత్స.

ఇంగిలీకము 4 భాగములు, రసకర్పూరము 2 భాగములు, రససింధూరము 1 భాగము, గంధకము 1 భాగము, ఈదినుసులన్నియుచనుబాలలో ఆరుదినాలు శుద్ధిచేసిపిమ్మట శుభ్రముగాకడిగి ఆటుపైననిమ్మపండ్లరసముతో పదునుగా 13 జాములుబాగామర్దనాచేసి పూట 1 కి వడ్లగింజయెత్తుచొప్పున ఆవువెన్నతో సేవింపవలెను. శగమానును.

## 24 చికిత్స.

నేలవేమువేళ్ళు అయిదుతులాలు, ధనియాలుఅయిదుతులాలు, ఉశిరికపప్పుఅయిదుతులాలు, ఆలకరక్కాయలైదుతులాలు, కరక్కాలైదుతులాలు, ఈదినుసులుచూర్ణించి పదితులాలుపంచదారలో కల్పుకొని పూట 1 కి వకతులముప్రమాణం చొ ॥ 2 పూటలుసేవించేది. అట్లుచూర్ణముపుచ్చుకోగానే మంచితేనె అరచేత(వేసికొనినాకేసేది. ఈలాపదిదినాలు చేయవలెను. పథ్యంచప్పిడి, నీళ్ళు, అన్నం, అన్నం మీదతేనెవేసికొనవచ్చును. నంజుకోవచ్చునుకూడాను.

25 చికిత్స.

నేలఉశిరిక, నేలగుమ్ముడి, నేలవులిమిడి, నేలతాడి, నేలవేము, రేవల్ చిన్ని, తవాక్షీర, చలవమిర్యాలు, యాలక్కాయలు, తుంగ దుంపలు, శిలాజిత్తుభస్మము, పచ్చకర్పూరము, ఈదినుస్సులుపంద్రెం డు సమాంశాలు చూర్ణించి చందిసీఅత్తరువుతో మర్దనాచేసి శనగ గింజంతేసి మాత్రిలుకట్టి తొలిపూటవకటి, రెండవపూటరెండు, మూ డవపూటమూడు, ఈప్రకారంగా తొమ్మిదిపూటలువరకు హెచ్చిం చుచూయిచ్చుచుండవలెను. తరువాత ఒక్కటిచొప్పునదించుచూ రావలెను. శగలుహరించును. ఇచ్చాపథ్యము.

26 చికిత్స.

బలురక్కెన సమూలందంచిన రసంఅరసోలెడులో తెల్లజీలకఱ్ఱ నల్లజీలకర రెండూరెండు డబ్బులెత్తు చూర్ణించి పైరసములోవేసి పం చదారకలుపుకొని సేవించేది. ఆవుమజ్జిగ, అన్నంచప్పిడిపత్యం.

27 చికిత్స.

పూట 1 కి అర్ధపావలాయెత్తు చెందిసీఅత్తరు చక్రికేళిఅరటి పండులోనుంచి రేపట మాపట రెండుపూటలు సేవింపవలెను. యిట్లుమూ డురోజులు. ఇచ్చాపత్యము.

28 చికిత్స.

తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, పెన్నేరు, తెల్లజిల్లేడుపూలు, ఈది నుసులుసమాంశాలు మర్దనచేసి పంచదారతోసేవించేది రేపటామాప టానుపావలాయెత్తు చొప్పునను మూడురోజులుచేయవలెను. ఇందుకు పత్యము పెరుగు, చారు.

29 చికిత్స.

వక తులము బెల్లముతో మూడు తులాలు ర చవ్రుశిరిక చెక్క చూర్ణము కలిపి బాగానూరి పదిమాత్రిలుకట్టి రేపట మాపట పుచ్చుకొనేది. చప్పిడిపత్యం, పెరుగు, అన్నము.

మరిన్ని తంగేడుచిగుళ్ళు మిరియాలు నూరి మూడుపొద్దులు రేపట ఆవుపెరుగుతోటి పుచ్చుకొనేది. పత్యంలేదు.

30 చికిత్స.

చలవమిర్యాలు, యాలకులు (యాలకాయలలోనిగింజలు) తుంగదుంపలు, నేలగుమ్ముడి, యిలావతి తవాక్షీరి, ఈదినుస్సులు సమాంశాలు, చెందినిఅత్తరువుతో మర్దనాచేసి కుంకుడుగింజప్రమాణంగామాత్రికట్టి అయిదురోజులు ఇచ్చేది. ఇచ్ఛాపత్యం.

31 చికిత్స.

రెండుతులాలుగంగరావి ఆకురసములో పచ్చకర్పూరము కొంచెము చేర్చిపొద్దిటిపూట పుచ్చుకొనవలెను.

32 చికిత్స.

గుంటగలగరసమూలము తెచ్చి అరతులము మిరియాలతో నూరిమాత్రిలు చేసిపొద్దుటిపూటలు, మూడుదినములు పుచ్చుకొనవలెను. మాత్రిగచ్చకాయ ప్రమాణం. పత్యం పొంగునీళ్ళ అన్నము.

33 చికిత్స.

గిద్దెడుజమ్మిఆకురసము, గిద్దెడు పెరుగు (ఆవుది) మిర్యాలుచూర్ణము పావలాయెత్తు కలిపి మూడుపూటలుసేవింపను శగరోగముహరించును. చప్పిడిపత్యము.

34 చికిత్స.

తెల్లబాడిశచెట్టుపట్టగాని, వేరుపట్టగాని, యెడించిదంచి వస్త్రఘాళితమొనర్చి పూట 1 కి పావుతులము చూర్ణముపంచదారతోటి

అయిదుపూటలు పుచ్చుకొనవలెను. తేనెగాని, పటికబెల్లంగాని అను పానములు పెట్టుకోవచ్చును. పత్యంలేదు.

35 చికిత్స.

గిద్దెడునేలవులిమిరాకుపసరులో చీనాపంచదారవేసి పదిపూటలుపుచ్చుకొన్నహరించును. చప్పిడిపత్యము.

304 తెల్లశగరు చికిత్స

ఏలకులు, లవంగాలు, వాయువిడంగములు, చల్వమిరియాలు కేవల్చిన్ని వీనిని సమభాగాలు ఉండచూచి మెత్తగాచూర్ణముచేసి పూట 1 కి పావలాయెత్తు చక్కెరలో కలిపి సేవింపవలెను.

2 చికిత్స

తెల్లపూలచంద్రికాంతదుంప తులమున్ను యాలకులు నాలుగు అణాలయెత్తున్ను నూరి ఆవువెన్నతో కలిపి సేవింపవలెను.

3 చికిత్స

ఈతచెట్టుపువ్వుతెచ్చి చీనాపంచదారతో మిళాకత్తుచేసి పూటకు పావుతులము చొప్పున సేవించేది. రెండుమూడు రోజులు పోను అరతులం మోతాదు చొప్పున సేవించవలెను.

4 చికిత్స

ఏనుగుపల్లేరుచెట్టు సమూలంతీసికొనివచ్చి మంచినీటిలో బాగా రుూడించి ఆపైన దంచి గిద్దెడురసముతీసికొని అందు తొమ్మిది మిరియాలు నూరి కలిపి రేపకడ మూడుదినాలు తాగేది. చప్పిడి పత్యము చేయవలెను.

5 చికిత్స

మిర్యాలు, గంగరావిచెక్క, సరిసమంగా తీసుకొని చక్కగా నూరి ముద్దచేసి కుంకుడుగింజంతేసిమాత్రిలుకట్టి చీనాపంచదారతో రేపటామాపటా మూడుదినాలు సేవింపకట్టును. పచ్చపెసలపప్పఅన్నము తినవలెను.

6 చికిత్స

బల్‌రక్కసి ఆకురసంతీసి అందులో పంచదార యెనిమిదణాలు యెత్తు వేసి అయిదు వుండలు పుచ్చుకొనవలెను.

7 చికిత్స

ఆవువెన్నలో బూరుగుచెక్క అరతులము మిర్యాలు పావలా యెత్తు కలియనూరి సేవించేది. కట్టును.

8 చికిత్స

గిద్దెడు యింతుపగింజలు మాడ్చి చూర్ణించి చీనాపంచదారతో మిశ్రమంచేసి పూటకు బెడయెత్తుపరిమాణంగా వారం దినాలు పుచ్చుకొనవలెను.

9 చికిత్స

ఒకడబ్బుయెత్తు దిగుడాయ నూనెలో తులము చాయపసుపు మెత్తగానూరి ఆచూర్ణము వేసి పుచ్చుకొనవలెను. చప్పిడి పత్యము

10 చికిత్స

నేలఉశిరిక సమూలము తెచ్చి కషాయముపెట్టి రేపకడమూడులేక నాలుగు తులాలు చొప్పున సేవించిన కట్టును.

11 చికిత్స

ఆవుపాలలో దేశవాళీశొం వేసి కాచి మూడేండ్లనాటి పాత బెల్లముతో చేర్చి పుచ్చుకొన్నయెడల తెల్లసెగ హరించును.

12 చికిత్స

కసింతాకు పసరులో చీనాపంచదారకలిపి మూడుదినములు రేపటమాపట యియ్యవలెను.

13 చికిత్స

నేలఉశిరికచెట్టు, జీలకర్ర ధనియాలు, ఈమూడుదినుసులు నూరి కలిపిమూడు దినములు ప్రొద్దుటి పూటయియ్యవలెను.

14 చికిత్స

నేలవుశిరిక సమూలంగానూరి పెరుగులో కలిపి సేవించవలెను

15 చికిత్స

గుంటకన్నాకుచిగుళ్ళు ఉత్తరేణిచిగుళ్ళు యీరెండుబాగానూరిన ముద్దకు సగంవంతు మిరియాలు నూరి కల్వాన పైమూడుదినుసులు చక్కగా కలియనూరి మర్దనాచేసి కుంకుడు గింజంత చొప్పున మాత్రలుకట్టి రేపటామాపటా పదిరోజులు సేవించేది. పత్యంలేదు.

16 చికిత్స

మిరియాలు రెండుతులములు శర్కర ఆరుతులాలు కలబంలోని, గుంజు మూడుతులాలు మంచిగంధముపొడి నకతులమున్ను నూరి మూడు పూటలుయిచ్చేది. పత్యంలేదు.

17 చికిత్స

ఒకశేరు మేకపాలలో పావుశేరె గుంటకన్నాకు పసరు పోసి కలిపి మూడురోజులు రేపటిపూట యియ్యవలెను. చప్పిడిపత్యం పైపత్యము మూడు రోజులలోను కందికట్టుతోను ఉప్పువేయించి ఉపయోగించేది. నివారణ మగును.

18 చికిత్స

లవంగాలు వంగభస్మముమూడుచిన్నములుయెత్తు తీసికొనితమలపాకులతో సేవించేది. ఇట్లురెండుపూటలా పదిదినాలు చేసేది. పులుసువర్జము

19 చికిత్స

చాయపసపు గుండకొట్టి ఆచూర్ణమునకు సమంమిరియాలు చూర్ణము బాగుగా మంచినీళ్ళతో నూరి ముద్దచేసి మూడుదినాలు రెండుపూటలు నిమ్మకాయంత సుమారుగా మాత్రచేసి పుచ్చుకొనేది. పత్యంలేదు.

305 పచ్చశగకు-చికిత్సలు.



వరగోగువేలుచెక్క రెండుతులాలు, చలవమిరియాలురెండుతులాలు, తుంగముస్తలు రెండుతులాలు ఈదినుసులుతో 1తులముచందిని అత్తరునుచేర్చి పూటకు పావుతులం మందుతీసికొని అరటిపండులో పెట్టిసేవించేది.

2 చికిత్స.

తంగేడు ఆకురసముతీసి గేదె పెరుగులో కలిపి సేవించిన మానును.

3 చికిత్స.

మిరియాలు, శొంఠి, జాజికాయ, లవంగాలు, పిప్పలికట్టె, కలబందలోపలిభాగము, పంచదార ఈదినుస్సులు సమభాగాలుగా చూచుకొని కలియనూరి సేవించవలెను. పథ్యములేదు.

4 చికిత్స.

కాల్చిన పచ్చగవ్వలచూర్ణమును పూట 1కి పావలాయెత్తు చొప్పున సేవింపవలెను. యజ్ఞపత్తియాకు తొక్కిరసముదీసి ఆరసము చీనాపంచదారలో మేళనచేసి పూటకు 1తులం చొప్పున సేవింపవలెను. హరించును.

5 చికిత్స.

తులము బెల్లములో ఆదొండవేరుచెక్క నూరిన ముద్దకలిపి గ్లాసులో నీళ్ళుపోసి అందులో ఆముద్దనువేసి కలిపి సేవింపవలెను. ఇందుకు పత్యము. ఆవుచల్ల, పెసరపప్పు, వేయించినఉప్పు వాడుకోవచ్చును.

6 చికిత్స.

జమ్మిపట్టయొక్కరసము తులము, కోరింతవేళ్లరసం తులము, పంచదార అరతులము, జీలకఱ్ఱ అరతులము చూర్ణముచేసి అన్నీకలిపి పూట 1కి నాల్గిణాలయెత్తు (పావుతులము) చొప్పునసేవింపవలెను.

7 చికిత్స.

నల్లజీలకఱ్ఱ, మంచిజీలకఱ్ఱ ఈ రెండు రెండు దమ్మిడీలయెత్తు తీసికొని అందు నల్లతుమ్మచెట్టు జిగురున్ను చేర్చి, అర్ధణాయెత్తు చీనా పంచదారకలిపి నూరి యియ్యవచ్చును. అయిదు పూటలుగాని తొమ్మిది పూటలు గాని యిచ్చేది. పథ్యములేదు.

8 చికిత్స.

గేదెవెన్నను గోడకేసికొట్టి తీసికొని అందులో బలరక్కసిపాలు పోడిచి ముద్దగాచేసి ఆముద్దలో కర్పూరశిలాజిత్తు భస్మముకలిపి మాత్రిలుచేసి మూడుదినములు పుచ్చుకొనవలెను.

9 చికిత్స.

కర్పూర శిలాజిత్తు భస్మము పూట 1కి రెండు చిన్నములయె త్తు చొప్పున తీసి పంచదారను కలిపి సేవించిన మానును. మరియు పచ్చని పూలుపూసే చంద్రికాంతదుంప, గాడిదగడపఆకు, పంచదార ఈదినుసులు సమాంశాలు తీసికొని పూటకు పావలాయెత్తు చొప్పున సేవింపను నివారణమగును.

10 చికిత్స

పచ్చ చంద్రికాంత దుంప రెండుతులాలు తీసికొని యాలుకు లు తులము, చలవమిరియాలుతులము నూరి ఈదినుసులు మూడును కలియనూరి పూట 1కి పావలాయెత్తు చొప్పున పుచ్చుకొనవలెను.

11 చికిత్స.

తుంగముస్తలు, చాయపసపు, తెల్లనిజీలకఱ్ఱ ఈదినుసులు సమాంశాలుగా చూచుకొని చూర్ణముచేసి వస్త్రగాళితముచేసి ఆవు నేతితో అరతులము మోతాదు చొప్పున 5 పూటలు 9 పూటలు సేవించవలెను.

12 చికిత్స.

తుంగదుంపలు, యాలకగింజలు, చలవమిర్యాలు, తవాక్షీరి శేవలచిన్ని ఈ దినుసులు మెత్తగా నూరి పాలలో కల్పియిచ్చేది. పూట 1కి కుంకుడుగింజ ప్రమాణము. ఇచ్ఛాపథ్యము.

13 పాతశెగలకు.

తెల్లజిల్లేడుపూలుఅయిదు, యాలకాయలుపది, లవంగాలు యెనిమిది, ఆలకరకాయలు యెనిమిది, చిల్లగింజలుయెనిమిది, వీటి నన్నిటిని కచ్చాపచ్చాగా వేపవలయును. ఇంగిలీకము రెండు గురుగిం జలెత్తు, తెల్లకాచు ఆరుగురిగింజలెత్తు, ఈ వస్తువులు ఆవువ్వులతో మర్దించి గచ్చకాయంతేసి మాత్రలుచేసి రెండు పూటలుయిచ్చేది.

అయిదు దినాలు చప్పిడిపత్యం పైపత్యములో ఉప్పువేయించి వేసుకోవచ్చును.

14 చికిత్స.

బొడ్డుచక్క, గులాబిపువ్వులు ఏడుగాని, తొమ్మిదిగాని, లవంగాలు, లవంగపట్ట, యేలకులు (ఏలకుపళ్ళు) ఇవిచూర్ణించి పూటకు దమ్మిడియెత్తు చాందినిఅత్తరులో పోసిపుచ్చుకొనేది.ఇచ్ఛాపత్యము.

15 చికిత్స,

పులిమిడిచక్క, నేలతాడి, నేలవేము, మంగదుంపలు ఇవివేర్వేరుగా చూర్ణించిసమభాగాగా కలుపుకొని మర్దించి పూటకుదమ్మిడీయెత్తు చందినీఅత్తరుతో మాత్రచేసి పుచ్చుకొనేది ఆలాగుఅయిదు దినాలు పుచ్చుకొనేది ఇచ్ఛాపత్యం.

16 చికిత్స

(శగకు, మూలమునకు, కుసుమవ్యాధులకు)

గాడిదగడపాకుపచ్చిది తులాలు పచ్చిదినేలవేము తులాలు, శ్రీగంధపుపొట్టు తు ౧, లవంగాలు తు ౧, లవంగపట్టతులం, యాలుకుపంప్లుతులము, పటికెపంచదారతులము, ఈదినుస్సులు చూర్ణించి మూడుదినాలు నిమ్మపండ్లరసాన మర్దించి, యింతుపగింజలంతేసి మాత్రలుచేసి, పూట 1 కి మూడుమాత్రలుకొరికె, అరతులమునీటితోపుచ్చుకొనవలెను, మాత్రలు పుచ్చుకొనేటప్పుడు—

" గోవింద, వాసుదేవ, నారాయణ, నమస్తే" అనిపుచ్చుకొనేది, కుసుమవ్యాధి, ప్రదరములు, మూలవ్యాధి, శగలున్ను, హరించును. ఏడుదినాలు మధ్యాహ్నము ఔషధముయివ్వవలెను పత్యము లేదు.

17 చికిత్స

కన్నెకోమలి, నేలతాడి, నేలవేము, గంధపొట్టు, తుంగముస్తలు, యాలుకగింజలు, ఈదినుసులు సమభాగాలుచూర్ణించిచందని అత్తరుతో కుంకుడుగింజప్రమాణముగా మాత్రలుచేసి పూటకువకటి చొప్పున అయిదుదినములు పుచ్చుకునేది. ఇచ్ఛాపత్యము.

18 చికిత్స

బూరుగువేరురసముదీసి ఆరసంలో రససింధూరము వక రాత్రి అంతా నానవేసి ఉదయాన తీసి సాంబ్రాణి పావుతులము ఆరతి కర్పూరము పావుతులము కవిరి పావుతులము ఈదినుసులుమర్దించి ఆ రసముతోనే సెనగగింజంతప్రమాణముగ మాత్రిలుకట్టి అయిదు దినాలు నీళ్ళతోటి పుచ్చుకొనేది. ఇచ్ఛాపత్యము

19 చికిత్స

బొమ్మజెముడుపండ్లు రెండు తెచ్చి రసముతీసి సూరేకారము వేసి కలిపి సాయంకాలము పొద్దుటపూట అయిదు రోజులు పెరుగు తోటి సేవించవలెను. ఇచ్ఛాపత్యము

20 చికిత్స

(పశిమి, తెలుపు, వీర్యవృద్ధి, తంతు మేహమునకు)

భూచక్రగడ్డ అర్ధశేరు కుంకుమ 1 తులము బ్రహ్మదొండి విత్తులు అర్ధశేరు సాలామిశ్రి 2 తులాలు ఇవి చూర్ణించి, ఖర్జూరపుపండ్లలో మైసాక్షి పాదిగి పాలతో ఉడుకబెట్టి చూర్ణముచేసేది.

చక్కెర అరవీశ తేనె అరవీశ నెయ్యి అరవీశ బంగాకు (గంజాయి ఆకు) రెండు శేర్లుతెచ్చి నీళ్ళలో అయిదారుసార్లు లెస్సగా కడిగి పచ్చనీళ్ళుపోనిచ్చి యెండబెట్టి చూర్ణము చేసి కల్పి లేహ్యపక్వము గావండి దింపుకొనేది. పైచూర్ణము పోసేది. దినము 1 కి రెండుతులాలు చొప్పున మోతాదు 40 దినాలు సేవింపవలెను. ఇచ్ఛాపత్యం

21 చికిత్స అనుభవం

నల్లబలుసువేళుతాట అర్ధశేరుతెచ్చి మేకపాలలో రెండుదినాలు ఊరనిచ్చి అటుపైని తీసి యెండబెట్టి చూర్ణము చేసి అందు పిప్పళ్ళు 1 పలము పసుపు 1 పలము ఆముదము 1 పలము తెల్లగడ్డలు (వెల్లుల్లి) 1 పలము ఈదినుసులు చూర్ణించి తాటిబెల్లముతో కలిపి దినము 1 కి రెండుతులాలు చొప్పున ఏడుదినాలు పుచ్చుకొనవలెను. పులుసువర్జము.

22 చికిత్స

రసము 1 తులము గంధకము 1 తులము ఈరెండు కలియనూరి అందులో కుప్పింటాకు (మురుకుండాకు) పిట్టపెట్టి రసముతీసి ఆ రసముతో నాల్గుగడియలునూరి ముద్దచేసి డబ్బిలోవుంచి దినము 1 కి గురిగింజంతయెత్తు చొ॥ అయిదు దినాలు పుచ్చుకొనేది. పులుపువర్జము.

306 మెట్టశెగకు

గచ్చాకు చిగురు ముద్దగానూరి పావుతులంయెత్తు మోతాదు చొప్పున పుచ్చుకొనిన మానును.

2 చికిత్స.

మెరిచందిరికాంత దుంప వకభాగము, చలవమిరియాలు వకభాగము, యేలకులువకభాగము ఈమూడు దినుసులు చూర్ణముచేసి పంచదారతో ప్రాతకు పావలాయెత్తు చొప్పున పుచ్చుకొన వలెను.

3 చికిత్స

తెల్లజీలకర్రి, నల్లజీలకర్రి సమాంశాలు తీసికొని రెడ్డివారి నానబాలాకుతో కలియనూరి 5 దినాలు పుచ్చుకొనవలెను. పథ్యం మజ్జిగ, అన్నము, చప్పిడి మాత్రిం.

4 చికిత్స.

ఉశిరెకకాయరసము, తేనె ఈవస్తువులు సమభాగాలు కలిపి ద్రాకముపట్టి వాడిన రక్తశగ హరించును.

5 చికిత్స.

1 తులముమిర్యాలు, 1 తులముతోగరుచెట్టు పట్టతో కలియ, నూరి పుల్లని కలితో పుచ్చుకోనవలెను. ఆవుమజ్జిగ అన్నముతినవలె.

6 చికిత్స.

సూరేకారము పావలాయెత్తు, రేవలచిన్ని నాల్గుతులాలు అర్ధశేరు పంచదార ఇవి చూర్ణించి నీటిలోకలిపివేసి మూడుపూటలు రేపకడనే పుచ్చుకోనేది. ఇచ్ఛాపత్యము.

7 చికిత్స.

307 త్రివిధ-శగలకు.

ఏలకులు అరతులము, చలవమిరియాలు ౧ తులము, పొగించిన పటికతులమున్నర, వెలిగారము పొంగించినది అరతులము, కర్పూరశిలాజిత్తు శుద్ధిచేసినది తుం౧ న్నర, సూరేకారం పావుతులము దాల్చినచెక్క అరతులము, పచ్చకర్పూరము అరతులము, కుంకుమ పువ్వు పాతికతులము, గసగసాలు పాతికతులము, ఈ దినుసులను బాగా చూర్ణంచేసి కొంచెము చెందిసీఅత్తరుతో కలిపి పూటకుపావు తులం చొప్పున పుచ్చుకొనిన చిరకాలమునుండి వంట జీర్ణించియున్న శగలుహరించును.

మరొకవిధము.

బల్ రక్కసి సమూలమునుతెచ్చి బాగాపలగగొట్టి రసముపిం డుకొనిదానిలో తెల్లచక్కెరకొంచెము చేర్చి సేవించిన సర్వరోగలు హరించును.

మరొకవిధం.

ఎఱ్ఱకలువగడ్డల చూర్ణమున్ను, చెముడుకాడలు కాల్చి భస్మ ముచేసినభస్మము సమాంశాలు యెత్తికొనికలిపి తెల్లచక్కెర అనుపాన ముతో పూటకుపావుతులం చొప్పున సేవించిన సర్వరోగలుహరించును.

మరోవిధము.

తొమ్మిది మిర్యాలు, రెండు అణాలెత్తు హారతి కర్పూరము (ముద్దగానుండేది) చంద్రికాంతదుంప ౧ తులము ఈ దినుస్సులు మూడునూరి మాత్రిలు చేసికొని పటికబెల్లముపొడిచేసి ఆపొడితో మూడురోజులు రేపటమాపట సేవింపవలెను.

మరొకవిధము.

వంగము, షడ్గుణమురెండున్ను రెండు అరతులములు బలర క్కసివేళ్ళరసాన మర్దనచేసి పెసగగింజలంతేసి మాత్రిలుచేసికొని చక్కెరతోటి పూటకు రెండేసిమాత్రిలు చొప్పున సేవించేది.

మరొకవిధం.

తొమ్మిదిమిరియాలు గుంటకన్నాకుచిగుళ్లుతొమ్మిది ఈ రెండు న్ను మెత్తగానూరి మాత్రిలుచేసి సేవింపను త్రివిధరోగలు హరించును. చప్పిడి. మిరపకాయకాల్చి ఉపయోగించుకోవచ్చును.

మరోవిధం.

యేపపచ్చ పంచదార సమాంశాలుబాగానూరి పెసరగింజం తేసి మాత్రింబకట్టి 5 దినములు సేవించవలెను. పత్యం చప్పిడి.

మరొక విధము

మిర్యాలు చలువమిర్యాలు తెల్లగొబ్బివేళ్ళు ఈదినుసులు చూర్ణముచేసి ఆవునేతితో వుడకనిచ్చి దింపుకొని పూటకు అరతులము చొప్పున పుచ్చుకొనిన అన్నిశగలు నివర్తించును.

మరొక విధము

తంగేడాకు యిగుళ్ళు అరతులంలో పంద్రెండు మిరియాలు వేసినూరి పొద్దుటపూట సేవించవలెను. లేదా ఆరెండున్ను నమిలి మింగవచ్చును.

తంగేడు చిగుళ్ళతో నల్లజీలకర్ర కవిరె కలియనూరి పూటకు అరతులము చొప్పున సేవింపవలెను.

మరొక విధము

తేనె గవ్వలను భస్మంచేసి ఆభస్మము అరతులము పావుతులము తవాక్షీర ఈరెండు ఆవుపాలతో సేవింపను నివారణమగును.

మరొక విధము

చిత్రమూలము పూడుగుచెక్క దుష్టుపువేళ్లు మిరియాలున్ను బాగుగా నూరి పూట 2 కి అరతులం మాత్రచొప్పన సేవించినను హరించును.

మరొక విధము

శ్రీచందనము రేవలచిన్ని కుంకుమపువ్వు పచ్చకర్పూరము జాజికాయ జాపత్రి పటికబెల్లము ఈదినుసులు సమభాగాలు యెత్తికొని చూర్ణముచేసి పూటకు పావుతులము వంతున సేవింపవలెను. హరించును.

మరిన్ని విధములు.

వరగోగువేరు పట్టయున్ను తుంగముస్తలున్ను సమభాగాలు బాగాచూర్ణముచేసి చెందినీ అత్తరుతోటి అనుపానం పూటకుపావలాయెత్తుచొప్పున సేవించిన సమస్తశెగలుహరించుటకు సందియంలేదు

తెల్లచక్కెర తెల్లజీలకర్ర నల్లజీకర్ర చల్వమిర్యాలు యేలకులు దినుసునకు పావుతులంచొప్పున యెత్తికొని చూర్ణించి యిరువది తులాలు సున్నపునీటిలో పావుతులము పైచెప్పిన చూర్ణము వేసి పుచ్చుకొనేది. శగలు హరించును.

మరొక విధము

చంద్రకాంత విత్తనాలు తుంగముస్తలు కచ్చూరములు కుంకుమపువ్వు యివి దినుసుకు రెండుతులాలు పచ్చకర్పూరము వక తులము, పొంగించినపటిక తు ౧ సుద్దముక్క, యేనుగు పల్లేరుకాయలు, చవ్యము, రక్తచందనము, కురువేరు ఇవన్నీ రెండేసి తులాలు, లవంగాలు, జాపత్రి, జాజికాయ ఈమూడున్ను తులం తులంచొప్పునను, మంచిగంధము నాల్గు తులాలు వీటిని కలబంద, కాకిదొండ, తెల్లతుమ్మవేరు, కసిందనేరు, ఈ నాల్గింటి రసాలతో ప్రత్యేకప్రత్యేకంగా

ఒకోక్కదినము బాగా మర్దించేది. పూటకు పాతికతులంచొప్పున సేవించిన చాలకాలమునుండియున్న రోగలు హరించును.

మరో విధము.

ఏలకులు మూడు తులాలు, చల్వమిర్యాలు రెండుతులాలు పొంగబెట్టిన వెలిగారమొకతులము, వీటిని మజ్జిపూడలు రసాన నాల్గు దినాలు లెస్సగామర్దనాచేసి పూటకు పావలామెత్తు ప్రమాణంగా సేవించిన బాధ నివారణగును.

ఇంకొక విధము.

మాచిపత్రి, తెల్లతుమ్మ చిగుళ్లు, తంగేడుచిగుళ్లు, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఈదినుస్సులు 1కి అరతులంమెత్తున తీసికొని నూరి పూటకు వకతులమువంతున సేవించిన సర్వరోగలు హరము.

308 అన్నిరోగలకు

గులాబిమొగ్గలు, దాల్చినచెక్క, లవంగాలు, పిప్పళ్ళు, రూమీమస్తకి, నేలువాదిగడ్డలు, ఈదినుస్సులు సమాంశాలు బాగా చూర్ణించి ఈ చూర్ణానికి సమంగా తెల్లచక్కెర చేర్చి పూటకు అరతులము ప్రమాణముసేవించను సర్వవిధరోగలు హరించును.

309 దుస్సాధ్యమగు అన్నిరోగలకు

పటిక, సూరేకారం, ఏలకులు, తెల్లజీలకర్ర, కబాబుచిన్ని, దాల్చినిచెక్కసమాంశాలు: మెత్తుకొని చూర్ణముచేసి పూట 1కి అరతులంచొప్పున పుచ్చుకొనవలెను. ఆతరువాత వెంటనే వకపావు శేరు

పాలల్లో నాల్గు పావుశేర్లు నీళ్ళుకలిపి అన్నీ పుచ్చుకోవలెను. అలా ఒకేసారి పుచ్చుకోలేకపోతే పది పదిహేను నిమిషములలోగా రెండు మూడుసార్లుగా నైనా పుచ్చుకోవచ్చును. మందు పొద్దుటపూటే పుచ్చుకొనవలెను. మూత్రము బాగా జారీఅగును. మూత్రకోశము నందలి దోషం హరించును, మాలిన్యం తొలగును. సుఖమిచ్చును.

## 310 సమస్త శగలకు

బలరక్కసివేరుపట్ట అరతులములో వకతమలపాకు బాగా నూరి కందిగింజల్లాగుమాత్రలు చేసి ప్రొద్దుటిపూట మూడేసి మాత్రలుచొప్పున మూడురోజులు యిచ్చినట్లయనా సమస్తశగలు హరించును. మజ్జిగ, చారు, పులుపువర్జము.

## 311 మూత్రము జారీఅగుటకు.

దేశవాళీశొంఠి, మిర్యాలు, జీలకర్ర, కురంజివాము, కరక్కాయలు, సైంధవలవణం, చూర్ణముచేసి ఆవునేతిలో బాగా ఉడికించి యిచ్చిన మూత్రంబాగా జారీఅగును.

## మరొక విధము.

చేనువ్వులు మజ్జిగలో నానబెట్టి బాగానూరి నాభికి పట్టువేసిన మూత్రముబాగా జారీఅగును.

## 312 నీరుడిమంటకు.

ఆవుమజ్జిగలో పంచదారకలిపి పుచ్చుకోవలెను.

## 313 శగరోగ ప్రారంభమునకు.

కటుకరోహిణికషాయమునుగాని, పల్లేరుకాయల కషాయమును

గాని మూడు పూటలిచ్చిన మిక్కిలి ప్రయోజనకరమై యుండును.

### 314 అన్నిశగలకు.

గచ్చకాయగుళ్ళు అరతులము, యష్టిమధుకము అరతులం మిర్యాలు అరతులము ఈదినుసులుమూటిన్ని చక్కగానూరి శేపటా మాపటా పుచ్చుకొన్న అన్నిజాతుల శగలు హరించును.

### మరొకవిధం

వకతులము చింతపండు, వకతులము రాసున్నము లెస్సగానూరి సెః గగింజప్రమాణము మాత్రలు కట్టి చీనాపంచదార అనుపానాన పూటకు రెండేసి మాత్రలుచొప్పున సేవింపవలెను.

### మరొకవిధం

మిర్యాలు, తెల్లజిల్లేడుమొగ్గలు, పంచదార, ఈదినుసులు సమభాగాలు తీసికొని మెత్తగానూరి మూడుపూటలు, యిండుపగింజ ప్రమాణంమాత్రలు, పథ్యం చప్పిడి, చల్లా, అన్నము.

### 315 పాతశగలకు

రేగాకుపసరు తులం, తెల్లనీరుల్లిరసము రెండుతులాలు ఈ రెంటినిచేర్చి నాల్గుపూటలు సేవింపవలెను. సమస్తపాతశగలు పోవును. పత్యంలేదు. 7 పూటలు కొందరు పుచ్చుకోవచ్చును.

### 316 త్రివిధశగకుశారం

1 కరక్కాయల పెచ్చు 2 దుంప పసుపు 3 చిత్రమూలం బెరడు 5 యిండుప కాయలు 5 లవంగాలు 6 జాజికాయ ఈ దినుసులు 1కి నాలుగు డబ్బులయెత్తు తీసికొని చూర్ణించి ఆవునేతిలో కలిపి పూటకు బేడయెత్తు చొప్పున సేవించవలెను. ఆట్లు 7 దినాలు జీర్ణించిన త్రివిధ శగలు హరించు చప్పిడి పథ్యం

2 మరొకవిధం

రెడ్డివారినాను బాలాకు రసమూలంతెచ్చి రసంతీసి ఆరసానను తెల్లజీలకర్ర నల్లజీలకర్ర ఈ రెండుసమూంశాలు మూర్ణించి కలిపి మెత్తగానూరి కుంకుడు గింజప్రమాణం మాత్రలుచేసి రేపటా మాపటా ఒక్కొక్క మాత్రచొప్పున పుచ్చుకొనవలెను. ఇట్లాలయిదు దినాలు చప్పిడి పత్యము చేయవలెను.

3 చికిత్స

పటికయు పంచదారయున్ను రెండున్ను రెండుతులాలు తీసి కొని మెత్తగానూరి రెడ్డివారినానుబాలాకు రసాన మాత్రచేసి సేవించ వలెను. మూడుదినములు చప్పిడి పత్యం

4 నాలుగు జాతులశగలకు

దిరిశన గింజలు తు ౧౨ లు సాలామిశ్రి. తు ౪ లు గొబ్బిగింజలు తు ౪ లు విలాలుయితి గొబ్బిగింజలు మిరేలు చీనాపంచదార తు 3 లు ఈ వస్తువులు అన్నిటినిచేర్చి దంచివస్త్రఘూళితము చేసి ఆవుపాలతో పూట 1కి వకతులము యెత్తుచొప్పున కలిపి రెండు పూటలిచ్చేది. శగలు హరించును. ఇచ్ఛాపత్యము.

5 చికిత్స

నాగ్గుతులములు సూరేకారము సైంధలవణము నాగ్గుతులాలు నూరి రేపటా మాపటా పావుతులం 1 చొప్పున మూడుదినాలు పుచ్చుకొనేది. ఆవుచల్లతోటి పుచ్చుకొనేది. పత్యము చప్పిడి చేయవలెను.

6 చికిత్స

బాగాముదిరినట్టి దానిమ్మ ఫలమును ఆవుమజ్జిగతో నూరి మాత్రను కుంకుడు గింజప్రమాణం అయిదుదినాలు పుచ్చుకొనేది. ఏదినాని కాదినమే చేసికొనవలెను. పత్యంలేదు.

సంపూర్ణము.

———:O:———

# వెండినగిషీఅంగడి.

మావద్ద బెంగుళూరు, మద్రాసు, మైసూరు గ్రామాదుల కంపెనీలలో పేరుపొందిన పనివాళ్ళను రప్పించి గ్యారంటిగా చాందీవెండితో తయారు అయిన మరజోడాలు, నగిషీమరజోడాలు, కంచములు గిన్నెలు, కమలంగిన్నె, సాదాగ్లాసులు, పలకలగ్లాసులు, నగిషీగ్లాసులు, తామరాకులు, అడ్డాకులు, మర్రిఆకులు, సాదాపళ్లెములు, రకరకాల నగిషీపళ్లెములు, కాఫీకప్పు అకడ్సాసల, ఫుట్ బాల్ బహుమతీకప్పులు, మరిన్ని కళావరు, డైమను అరకు ఇస్పేటు రకముల కుంకుమబరిణలు, స్త్రీలకుపయోగించు డయిమన్ కటింగు చమ్కున్న, మిరియాలపట్టాలు, గట్టితోడాలు, కడియాలు, గుల్లకడియాలు యింకా అనేక నమోనాలుగా తయారుచేయబడును. వెండిసామానులు యేనమోనా కావలసిన ఆనమోనాగా గ్యారంటీగా పేరుపొందిన పనివాళ్ళచేత మీరు యిచ్చిన నమోనాగా తయారుచేయించి వ్రాయిదాప్రకారం యివ్వగలము. హాజరుగాకావలసిన విక్రయమునకు మావద్ద బొంబాయి చాందీవెండిగల వస్తువులు సరసమయిన ధరలకు దొరుకును. ఇంకను మావద్ద నాణ్యమైన తివాసీలు, జంబకాణాలు, పట్టుపంచెలు విక్రయమునకు దొరుకును ఏకేపర్యాయము అర్డరు యిచ్చిచూడుడు. కావలసినవారు ఈక్రింద చిరునామాకు వ్రాయుడు మీఅడ్రసు సరిగా పెద్దఅక్షరములతో వ్రాయుడు.

పలయువారు:—

కాళ్లేపల్లి వీర్రాజు అండు కంపెనీ,

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B190 |
| పుస్తకం పేరు | గృహవైద్య చికిత్సా సారము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Ch. Ramya |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |